శ్రీ ప్రభాకర పరిశోధక మండలి
ప్రచురణము. సంఖ్య 8

# నాగానందము
(శ్రీహర్షకృతికి తెనుఁగు)

శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి
శ్రీ దివాకర్ల వేంకటావధాని.

ప్రకాశకులు:
మేనేజరు, మణిమంజరి,
మద్రాసు.

1954

కరుణరసమిశ్రితమై పఠితలహృదయములు ద్రవీభవింపఁ జేయుచు నాగానంద నాటకమునకుఁ బ్రపంచనాటకములలో నున్నతమైనస్థానము కల్పించుచున్నది.

ఈ ఉత్తరార్ధమునందలి లోకోత్తర రసపోషణాసంవిధానముచే నాకర్షింపఁబడినవారై కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రిగారీ నాగానందనాటకము నాంధ్రీకరింప నారంభించిరి. కాని యందలి రెండంకములు మాత్రము తెనిఁగించి దివంగతులైరి. విమర్శనపాటవమునను, ఆంధ్రీకరణానైపుణ్యమునను శ్రీ శాస్త్రిగారికిఁ గలప్రజ్ఞ యనితరసామాన్యమైనది. వారిచేతనే నాటకము పూర్తిగాఁ గొనసాగియుండినచో నిది యాంధ్రీకృత నాటకముల కెల్ల నొజ్జబంతియై యలరారి యుండెడిది. కాని యాంధ్రభాష కట్టి యదృష్టము లభింపలేదు. శ్రీ శాస్త్రిగారు దివంగతులైనపిమ్మట వారియందలి భక్తిగౌరవములు ప్రేరేప వారి శిష్యులును, ఉస్మానియా విశ్వవిద్యాలయమున నాంధ్ర భాషోపన్యాసకులు నైన శ్రీ దివాకర్ల వేంకటావధానిగారు మిగిలిన భాగమును గూడఁ బూరించి యిచ్చిరి. వారికి మా కృతజ్ఞత.

ఇట్లు,

ప్రకాశకులు.

మఱియు,

సీ. ఉరవడించుచు శరంబరిఁబోసి సెగలాగి
చేయాడక నడుంకె చిత్తభవుఁడు
గొప్ప చప్పుళ్ళతోఁ దప్పెటల్ సఱచుచు
వెడ ఁౢలుచును మారవీర భటులు
అదరులు బోమముల్లు నావులింతలు నవ్వ
లలరుచూడ్కుల డొంకు చప్పగలును
బులకాంకురంబు లుప్పొంగఁగా నోడలెల్ల
వీసరపాటుతో వాసవుండు
నంతలంతలఁ దలవాంచి యఖిలసిద్ధు
లారయుచు నిశ్చలత కబ్బ మందుచుండ
యోగపీఠిక నెలకొన్న యుజ్జ్వలుండు.
ధ్యాని, మానిబుద్ధుఁడు మిమ్ముఁ దనుపుఁగాత!

(నాంద్యంతమున)

సూత్రధారుఁడు — అతివిస్తర మేలనుకు?
ఈ యింద్రోత్సవమున నానా దిగ్దేశాగతమును
శ్రీహర్షదేవ చక్రవర్తి పాదపద్మోపజీవియునగు
రాజసమూహము సబహుమానముగా నన్నుఁ

బిలిచి యిట్లు చెప్పి యుండెను. "అస్మ త్స్వామి యగు శ్రీహర్షదేవునిచే నపూర్వవస్తు రచనాలంకృతమును విద్యాధర జాతకప్రతిసబద్ధము నగు నాగానందమను నాటకము రచింపఁబడెనని మేము కర్ణాకర్ణిగా వినియుంటిమే కాని ప్రయోగింపఁ బడుచుండఁగాఁ జూచి యుండలేదు. అందుచే సకల జన హృదయాహ్లాదకుఁ డగు నా మహారాజు నెడఁ గల గౌరవముచేతను, మమ్మనుగ్రహించు తలంపు చేతను దానిని మీరు యథోచితముగాఁ బ్రదర్శింప వలయు" నని. కావున నిప్పుడు నేపథ్య రచన నొనరించి వారికోరిక నెఱవేర్చెదను. (పరిక్రమించి చూచి) సామాజికు లందఱి మనస్సు లాకర్షింపఁ బడిన వని నా నిశ్చయము. ఏలయన,

ఉ. కవి శ్రీహర్షుఁడు చాల నేర్పరి, గుణ
గ్రాహులల్ సభాస్తారులుఁ,
జవులొల్కుఁ భువి బోధిసత్త్వకథ, వి
న్నాణంబు గన్నార మిం
పవు నాట్యంబున నేము, నిం దొకొక్కటే
యభ్యర్థిత ప్రాప్తికిం

దవు, మద్భాగ్యమునన్ సమస్తమును సం
దర్శించె నింకేమనన్,

అందుచే నేనిప్పు డింటికేగి యిల్లాలిని బిల్చి సంగీతక మనుష్ఠించెదను. (పరిక్రమించి నేపథ్యాభిముఖముగాఁ జూచి) ఇదే మాయిల్లు. ప్రవేశించెదను. (ప్రవేశించి)

క. పరిజన బంధు ద్విజహిత
చరితా! మద్గృహ సరోజ చరమానాంసీ
పరపురుష శశి సరోజిని
యరుదేఁగదె కలదు కార్యమార్యా! యిటకున్.

నటి—(ప్రవేశించి, కన్నీళ్ళతో) ఇదిగో! మందభాగ్యురాలనైన నేను వచ్చితిని. ఏ నియోగ మనుష్ఠించాలో ఆర్యపుత్రుఁడు సెలవిచ్చుఁ గాక.

సూత్ర—(చూచి) ఆర్యా! నాగానందము నటింపవలసి యుండఁగా నిట్టికారణముగా నేడ్చుచుంటివేమి ?

నటి:—ఆర్య! మీరా తండ్రిగారు వార్ధక్యంచే నిర్వేదంపుట్టగా మీరింక కుటుంబభారం వహించ డానికి తగుదానని మనసులో ఆలోచించి ఆర్యురాలితో కూడా తపోవనానికి వెళ్ళుచుండగా నే నెట్లేమవసుంటా ఉండగలను?

సూత్ర—(నిర్వేదముతో) ఏమి? నన్ను విడిచి జననీజనకులు తపోవనమున కరిగియుండిరా? నే నిప్పు డేమి చేయుట యుక్తముగా నుండును. (ఆలోచించి) గురుచరణ సేవాసుఖము నుజ్జగించి నేనుమాత్ర మింట నెట్లుండఁగలను?

గీ. తరముల క్రమంబునందుండి పరఁగివచ్చు
సంపదల నెల్ల నిదె నేను సంత్యజించి
చనెదఁ దలిదండ్రులకుఁ బరిచర్య సలుప
నడవి కల్ల జీమూతవాహనుఁడు పోలె.



# నా గా నం ద ము

## ప్ర థ మాం క ము

---

[అంత నాయకుఁడు, విదూషకుఁడు ప్రవేశింతురు]

నాయకుడు—(నిర్వేదముతో) మిత్రమా! ఆత్రేయ!

చ. వలపుల రేపుచుండు నిలు
    వంబడి యుండకు, తప్పొ లొప్పులుం
దెలియఁగనీయ, దింద్రియ వి
    ధేయము, యౌవన, మిట్టి చెట్టచేఁ
తలు గలదయ్యు నా కిది హి
    తంబ యగున్ గదుభక్తిఁ దల్లిదం
డ్రులకు సపర్యలన్ నెఱపు
    త్రోవనె నన్నిటు పోవనిచ్చినన్.

విదూషకుఁడు—(రోషముతో) చెలికాడా! నీ విన్నాళ్ళదాకా బ్రతికియుండి, చసిపోయిన

వాళ్ళతో సమానులైన నీ తలిదండ్రులకోసం వన వాస దుఃఖాన్నే అనుభవిస్తూ నిర్వేదముతో ఉంటివాయెను. కనుక ఇప్పుడైనా నామనవి చిత్తగించు. తొలంగిపోయిన గురుచరణ శుశ్రూషా నిర్బంధాన్ని తొలగిపోనిచ్చి యిష్టభోగాలతో రమణీయమైన రాజ్యసుఖాన్ని హాయిగా అనుభ విస్తువుగాని.

నాయకుడు—మిత్రమా! మంచిదిగాదోయి నీ మాట.

పితరుల చెంత వసించు
సుఖం బొదవించునె సింగపుగద్దియు; నా
పితరుల పాదము లొత్తు
సుఖం బొదవించునె మించిన రాజకముల్ గా
బితరులు తిన్నది గొన్న
సుఖం బొదవించునె భూపతి భోగములున్
బితరుల వీడినవానికి
రాజ్యము సస్యకమ యుక్కటులే కొలుపున్.

విదూ—(ఆత్మగతము) అన్నా! ఎంతడి! ఈతడి గురుచరణ శుశ్రూషానురాగము! (మో

చించి) కానీ మళ్ళీయిట్లా మాట్లాడిచూస్తాను. (ప్రకాశముగ) చెలికాడా! నే నవి కేవలం రాజ్య సుఖాన్ని ఉద్దేశించే చెప్పింది కాదబ్బా! వేరుగా నీవు చేయవలసిన పని ఇంకా అట్టే ఉన్నది!

నాయ—(చిరునవ్వుతో) మిత్రమా! చేయ వలసినదెల్లఁ జేసివేసితినే గదోయీ! చూడు.

ఉ. తీర్చితి న్యాయమార్గ మున
 తిన్ జగతీ ప్రజ, సజ్జనాళికిం
గూర్చితి సౌఖ్యముల్, సలుపు
 కొంటిని బంధుల నాత్మతుల్యతన్
బేర్చిన రాజ్యరక్ష యొద
 వించితిఁ గల్పక మర్థికోటి కిఁ
దార్చితిఁ జెల్పు మింకఁ గల
 దా కరణీయము నాకు మిత్రమా!

విదూ—మిత్రమా! అత్యంత సాహసుడు, మతంగహాతకుడు నీకు విరోధి. వాఁడు పక్కలో పోటుగా ఉన్నంతకాలం ప్రధానామాత్యుడు పరి కిస్తూనే ఉన్నా, నీవు దగ్గరలేకపోతే రాజ్యం స్థిరంగా నిలవ దని నాకు తోస్తుంది.

నాయ — ఛీ! మతిమాలినవాడా! ఏమి? మతంగుడు రాజ్యము హరించునని కొంకుచుంటివా?

విదూ — అవును.

నాయ — అయితే, మరీమేలు! ఇంకేమి? నా శరీరమాదిగా సర్వమును పరార్థమే నేను పాటించు చున్నాఁడను. కనుక స్వయముగానే త్యాగ మేలచేయవైతివందువా? అది నాయనగారి నిర్బంధమునలన; ఎందుకీరాజ్యపు గొడవనుగూర్చి యోచనలు! నాయనగారి యానతిచొప్పున నడచుకొనుట మంచిది. నాయనగారిట్లాజ్ఞాపించిరి. "నాయనా! జీమూతవాహనా! పెక్కునాళ్ళనుండి వినియోగించుటచే నిక్కడ సమిధలు, దర్భలు, పుష్పములు, నివ్వరులు కందమూలఫలాదులు తగ్గిపోయినవి. కనుక నిక్కడనుండి మలయపర్వతమున కేగి, అందు నివాసయోగ్యమగు నాశ్రమపదము నొకదాని గుర్తించుకొని రమ్ము" అని. కనుక మలయపర్వతమునకే పోవుదము రమ్ము.

విదూ___సెలవు ప్రకారము.

(ఇద్దరు పరిక్రమింతురు)

విదూ___ (ముందుకుఁజూచి) చెలికాఁడా! చూడు. ఆహా! ఇది మలయమారుతముసుమా! చల్లని మంచిగంధపు తోపులతో మెలగాడుతూ ఉండడంచేత వాటి పరిమళపు గమగమలుకలదై ఒడ్డోలకపు చఱియల దూకుళ్ళవల్ల చెల్లాచెదరులై రేగుతూ సెలయేళ్ళతుంపర్ల మోతచేత చల్లచల్లనై యీ మలయానిలము తొలికూటమికి కలవరించే నెయ్యురాలి కౌగిలింతలాగా నడక బడలికను తొలగిస్తూ గగ్గురుపాటు కలిగిస్తూ ఉన్నదికదా! నా చెలికానికి___

నాయ___(చూచిఅచ్చెరువుతో) అవునోయి, మనము మలయపర్వతమునకు వచ్చివేసితిమి. (అంతటఁ గలయఁజూచి) ఏమి యీ మలయపర్వతపు రామణీయకము!

సీ. గంధకరుల్ గండ కషణంబుసేయ భ
గ్నములై వలుచు చందనద్రుమములు
సాగరవీచికా స్ఫాలనమ్ములచేత
బహ్వారవము లీను గహ్వరములు
సిద్ధవధూసమంచిత పాదలాక్షాప్తి
నరుణంబులైన ముత్యాలరాలు
జలధితుంపురు లంటి చందనతరు లంటి
తెరలువాఱెడు కమ్మతెమ్మెరలును

తే. గీ. గలిగి మలయాచలంబది తలఁపులెల్లఁ
జూఱఁగొనుచున్న దిదె యెక్కి చూతమిందు
దొరకఁ గలదేమొ చెలికాఁడ! తోడరమ్ము
నని, వసింపఁగఁదగిన యాశ్రమపదమ్ము.

విదూ.__అలాగే చూదాం—(ముందు నిలచి) రా మఱి నీవు!

నాయ.— (కుడికన్నదురుట సూచించి) ఓహో !

తే. అదరుచున్నది కుడికన్ను మది నెడియును
లాభమునుగూర్చి నాకుఁ దలంపులేదు

రి త్తగా నేర వెన్నఁడు ఋషులపలుకు
లిపుడు నా కేమి యిది ఘటియించు నొక్కొ?

విదూ.—చెలికాడా! నీ కేదో మేలు దరి దాపు నున్న దని సూచిస్తున్నది.

నాయ.—అవును. నీ వన్నట్లే కావలెను.

విదూ.—(చూచి) ఓ చెలికాడా! చూడు! చూడు! అదిగో, అదితపోవనమువలె వున్నది. జొంపముల నిగనిగలతో సొంపారుతూ దట్టముగా కొన్ని వృక్షవిశేషములు పెరిగున్నవి. హావిర్గంధపు గమగమలుగలిగి హోమధూమములు చెలరేగుతున్నవి. కొదమలేళ్ళ కదుపులు, వెరపులేక హాయిగా శయనించి ఉన్నవి.

నాయ.—సరిగా గుర్తించితివి. తపోవనమే యిది.

చ. పలుచఁగఁ జెట్లపట్ల లోలు
వంబడె నర్మిలి వల్కలార్ద్రమై

తెలి సెలయేటఁ దోఁచుఁ గదుఁ
దేటఁ గమండలు ఖండములన్ వటుల్
తొలచిన వెందు గప్పెడుఁ
ద్రుంగిన పూఁజులు మేఖలల్ బడిన్
జిలుకలు నిత్యముగా వినుట
చేఁ బఠియించెడు సామపాఠముల్.

కనుక ప్రవేశించి చూతమురమ్ము.

(ఇద్దఱు ప్రవేశము నటింతురు.)

నాయ— (అచ్చెరువుతో చూచి) హాయి! హాయి గదోయి! సంతోషముతో మునిజనులు సందిగ్ధములైన వేదవాక్యములఁజర్చించుచున్నారు. అధ్యయనము చేయు వటువులును పచ్చిగానున్న సమిధలు విఱుచుచున్నారు - మునికన్నెలు గున్న చెట్ల గుదుళ్ళలో నీరు నించుచున్నారు. ఈ తపోవన మెంత ప్రశాంతరమణీయముగ నున్నది.

మ. అలరన్ స్వాగతవాక్యముల్ పలుకుచు
న్నట్లయ్యె భృంగ ధ్వనిన్
దలతో మ్రొక్కుచు నున్న యట్లెసఁగె బం
డ్లన్ వాలిలు నగ్రంబులున్

నలి నర్ఘ్యంబిడుచున్నటుల్ పొలిచెఁ జెం
    తన్ రాలు పుష్పంబులున్
గలయన్ నేర్చినవేమొ యుందతిథిస
    త్కారంబు వృక్షంబులున్.

కాబట్టి యిది నివాసయోగ్యమగు తపోవన మని తలఁతును. ఇక్కడనుంటిమా మనకుఁ జాల హాయిగా నుండును.

విదూ—(ఇటునటుఁజూచి) చెలికాడా! ఇల్లిదిగో! తెల్లని మెడ లరమలపి అరమేసిన దర్భపిల్లు జారి పడిపోతున్న నోళ్లు మెదల్పక ఒక్క చెవి నాకళింపుమీద నిక్కబెట్టుకొని, హాయిరైయె కళ్ళు మూసుకొని ఏదో వింటూన్నట్టు కనపడుతున్నది.

నాయ—(చెవియొగ్గి) మిత్రమా! సరిగా గుర్తించితివి. ఔనుసుమా!

సీ. రొమ్ము మూర్ధమ్ము కంఠమ్మును నెలవులు
    మీఱకుండఁగ మంద్రతారమధ్య
మ స్వరంబులు సక్రమంబులై గమకంపు
    సొంపుతో నున్నవి జుమ్ము మనుచుఁ

ధూమ్రవర్ణోత చందమ్మునఁ దంత్రులు
ప్రోయవీణియ శ్రుతి లీయమందె
జలిబిలిపలుకులు తెలివిడి వినవయ్య
గేయ మయ్యది దాసి హాయివలన

తే. గీ. తేళ్ళనిగో! చూడు చెలికాఁడ లేత గరిక
పిడుచ లకమేసినవికూడ విడిచి నోళ్ళఁ
గలుగు నమలుడు సద్దులు కట్టిపెట్టి
యొడళు లటు సికర్ణ నదె వినుచున్న వహహా!

విదూ—చెలికాఁడా! ఎవరో యీతపోవనంలో పాడుతున్నారు. లేతప్రేళ్ళమీటులకు అంత గట్టిగా కాకుండ తీగలు మ్రోగుచున్నవి. కాకలీప్రధానమయిన గానము కాబోలును. (ప్రేలితో ముందుకు నిర్దేశించుచు) ఇదిగో! ఈ దేవాలయమున దేవతారాధనలో నదె యొకదివ్యాంగన వీణావాద్యోపచారము సలుపుచున్నది.

విదూ—చెలికాఁడా! రా! మనంకూడ ఈ దేవాలయాన్ని చూతాము.

నాయ.—మిత్రమా! మంచిమాట. దేవతా వందనము గావింపవలసినదే కదా!

(చేరఁబోవుచు తటాలున నిలిచి) మిత్రమా! ఒకవేళ మనము జూడఁదగనిది గావచ్చును ఈస్త్రీజనము. కావున మన మీ చీఁకటి చెట్లగుబురుచాటున నాగి దేవతాదర్శనావసరము ప్రతీక్షింతము. (అట్లు చేయుదురు.)

(అంత నేలఁగూర్చుండి వీణ వాయించుచున్న మలయవతియుఁ, జేటియుఁ బ్రవేశింతురు.)

నాయిక—(పాడును)

(ద్విపద)

ఆరఁబూచిన తమ్మియకేరు పుష్పాళి
గౌరవర్ణము మేనఁ గలదేవి గౌరి!
మముఁ గన్నతల్లి యుష్మత్ ప్రసాదమున
సమకూడుఁగాక నా సమభివాంఛితము.

నాయకుడు.—(పాటవిని) మిత్రమా! ఏమి పాట! ఏమి వాయింపు! బలే!

పదివిధములగల వ్యంజన ధాతులు
స్పష్టముగాఁ గులుకింపఁదగెన్
విదితపడెన్ ద్రుత మధ్యమ లంబిత
భేదములొప్పుగ మూఁడు లయల్
గదిరెసమాద్యములైన యతుల్
సరిగాఁ ద్రివిధంబులు సక్రమతన్
పొదలెను జక్కఁగ దత్త్వముఖంబులు
ముత్తెఱఁగుల్ గల వాద్యవిధుల్.

చేటి—(చనవుతో) భర్తృదారికా! చాల సేపట్నుంచి వాయిస్తున్నారాయెను. నీ చిగురు వేళ్ళకు నొప్పి యెత్తడంలేదా?

నాయిక—ఓసి-చతురికా! గౌరీదేవి ముందర వీణ వాయిస్తున్నానుకదా ఎందుకు నొప్పి కలుగు తుందే నాచేతి చిగుళ్ళకు?

చేటి—భర్తృదారికా! ఎట్టి సిద్ధయురాలమ్మా గారు అయ్యన్నారు! ఈమె ముందర ఎంత వీణ వాయించీ ఏమి లాభమమ్మా! కన్నెపడుచు లెవ రికీ తరంగానన్ని కటికి సయమాలు, ఉపోష్యాలూ

ఉంటూ ఇన్నాళ్ళారాధిస్తివి. అయినా యింకా ప్రసాదం అనుగ్రహించదాయెను.

విదూ.—చెలికాడా! కన్యక అటోయి ఈమె! కనుక చూడవచ్చుగా మనం?

నాయ.— తప్పేమి? కన్యకలను జూచుట దోషముగాదు. కాని, ఒకవేళ మనలనుజూచి పసితనముగనుక సిగ్గునను, భయమునను వెంటనే వెడలిపోయినను బోగలదు. కనుక నీ చీకటిచెట్లమఱుగున నాగియే చూతము.

(ఇద్దఱు అట్లు చూతురు)

విదూ.—చెలికాడా! చూడు! చూడు! అబ్బ! అబ్బురము! ఈవిడ వీణవాయించే విన్నాణంచేత చెవులకే చవులొలికించడంగాదు. ఈ విన్నాణానికి తోడయిన చక్కదనంతో కళ్ళకుగూడా కడు వేడుక కూరుస్తున్నది. ఈవిడ ఎవరై వుంటుంది? దేవకన్యకా! లేక నాగకన్యకా! కాక సిద్ధకన్యకా! ఇక తప్పితే విద్యాధరకన్యకా!

నాయ.—(ఆసతో(జూచుచు) మిత్రమా! అది యే జాతి కన్యకయో నే నెఱుగనుగాని, అయితే యిదిమాత్రము చెప్పగలను.

ఉ. క్ష్మాధరభేది వేగనులు
శ్లాఘ్యము లచ్చర యేసి, నాగబిం
బాధరఁయేసి దీని మొగ
మార్చు రసాతల మిందు హీనమున్
గాథను సిద్ధయోషఁ త్రిజ
గత్ప్రథితంబగు సిద్ధజాతి, వి
ద్యాధరయోషఁ కేమి ఫలితంబ మ
దన్వయ భాగ్యవల్లికిన్.*

విదూ—(నాయకుని జూచి, సంతసముతో) (స్వగతము) అబ్బ! ఎన్నాళ్ళకుచిక్కాఁడు! ఈతడు కౌముదికంటికి. (తన్నుఁ జూచుకొని ఆరగింపు సభిస

---

*సురపతి వేయు కన్నులకుఁ
జూలు సురాంగనయేసి, నాగసుం
దరి యయినన్ రసాతలము
నన్ నెలలేవడి దీసి మోముచే
సఖును, జగత్ప్రసిద్ధపరు
లౌదురు సిద్ధులు సిద్ధకాంతయేన్
గరిమము మాదుజాతి కధి
కంబగు మత్కుల జాతమైనచోన్.

యిస్తూ) కాదు, కాదు, అసలయిన బ్రాహ్మడికి నాకే చిక్కాఁడు.

చేటి— (చెలిమితో) భర్తృదారికా! ఎందు కమ్మా! యిప్పుడింకాను. ఎంతకూ సంతోషించనీ. కసికర మెరుగనీ, ఈ అమ్మవారిముందర వాయించడం! (వీణను పట్టిలాగును)

నాయిక—(కోపముతో)ఆఁ! ఆఁ! ఒసే! గౌరీ అమ్మవారిని ఆక్షేపిస్తావటే! తప్పు! తప్పు! ఇప్పుడే నే ఆమె ప్రసాదం నాకు లభించింది.

చేటి— (సంతోషముతో) భర్తృదారికా! అయితే చెప్పవమ్మా, ఎటువంటిదో ఆప్రసాదము!

నాయిక—ఒసేవు! ఇప్పుడు కలలో ఈవీణ వాయిస్తూ ఉండగా గౌరీ అమ్మవా రిట్లానెల విచ్చారు. "అమ్మా! వీణవాయించడంలో నీకున్న విన్నాణానికీ, మరిన్ని అబలలకు అనుష్ఠించ శక్యంగానిదిగా నామీద నీకున్న భక్తికీ, చాల సంతోషించాను. కనుక విద్యాధరచక్రవర్తి దరిదాపుననే నిన్ను చెట్టపట్టగలడు" అని.

చేటి—(హర్షముతో) భర్తృదారికా! అలాగైతే అది కల అని ఎందుకంటావు? అమ్మవారు నీకు హృదయమున నున్నట్లుగా చేసిన వరప్రదానముగదా అది.

విదూ—చెలికాడా! అవసరముగదా మన కిది దేవి దర్శనానికి. రా! చేరబోదము.

నాయ—రానోయి; నేను రాను.

(విదూ—ఒల్లకున్నను నాయకుని బలవంతముగా ఈడ్చుకొని పోవును. ఇద్దరు దేవాలయమున ప్రవేశింతురు)

విదూ—(చేరబోయి) అమ్మా! నీకు శుభమగుగాక! చతురిక సత్యమే పలికిందమ్మా! అమ్మవారు నీకు చేసిన వరప్రసాదమేనమ్మా ఇది.

నాయిక—(వెఱపుతో లేచి, నాయకు నుద్దేశించి యపవారించి) సఖి! ఈయన ఎవరే?

చేటి—(నాయకునిం దిలకించి యపవారించి) ఎక్కడా పోలికలేని ఈ చక్కదనాన్నిబట్టి చూడగ అమ్మవారు ప్రసాదించిన వరుడీతడేఅని తోస్తున్నది.

(నాయిక సిగ్గుతో, వేడుకతోఁగూడ నాయకునిఁ
జూచును.)

నాయ—

చ. జళుకు వెడంద కన్నుఁగవ
సౌరునఁ జెన్నగు చిన్నదాన! యూ
ర్పులవలనన్ వడంకెనిదె
పో! ఘనపీనమురఃప్రదేశమో
చెల! యిటు లింతగాఁ దపము
చేతనె వాడిన లేఁత మేనికీ
కలవరపాటుతో మరియుఁ
గష్టముగూర్చెద వింత యేటికో.

నాయిక—(అపవారించి) ఒసే! చాలా గుబులుగావుంది. ఈయన సమ్ముఖాన నిలవలేనే నేను. (నాయకుని సిగ్గుతో ఓరగా జూచుచు మొగము కొంచెము పెడత్రిప్పి నిలుచును)

చేటి—భర్తృదారికా! ఏమిది?

నాయిక—ఒసే! ఈయన కింత దగ్గరగా నే నిలువలేనే! అవతలకు పోదాం రా. (పోఁబోవును)

విదూ__ఓయి మిత్రవా! ఈమె భయపడు తోంది. నేను చదువుకునేనాళ్ళలో చదువునువలె ఈమెనుకాస్సేపు ఆపుతాను, తరలిపోకుండా.(విమర్శించి) ఏమమ్మా! మీ తపోవనంలో ఇదే ఆచారమా ఏమిటి? అతిథివస్తే నోటిమాటతోనైన ఆదరించకుండా పోవడమా?

చేటి__(నాయకునిఁజూచి; స్వగతము) ఈమె చూపు అటుకేసి వలపు గొన్నట్లున్నది. మంచిదే. పలకరించి చూస్తాను. (ప్రకాశము) సెలవిచ్చారు అయ్యవారు. భర్తృదారికా! అతిథిగా వచ్చిన వారికింత మరియాద జరపాలెగదా! ఎంచేతనమ్మా ఈ మహానుభావునిఁజూచి దిగాలుపడి ఊరుకుంటావు? అయితే నీవుండు. నేను తగిన మరియాద జరుపుతాను. అయ్యా! విజయం చెయ్యండి. మాను బాగులు! ఇదిగో ఈఆసనంమీద కూర్చొని యీ పట్టును శోభాయమానం చెయ్యండయ్యా!

విదూ__చెలికాడా! ఈ చతురిక శుభము పలుకుతోంది. కాస్సేపుకూర్చుండి విశ్రమిస్తాము.

నాయ__మంచిది. (కూర్చుందురు)

నాయిక—(చేటి నుద్దేశించి) ఓసి కొంటె దానా! అట్లాచేయకుమా! ఎవరైనా తాపసులు చూచి నన్ను అవినయంగలదానిగా అనుకుంటారు సుమా!

(అంతఁ దాపసుఁడు ప్రవేశించును)

తాపసుఁడు—కులపతులు కౌశికులవా రిట్లాజ్ఞాపించిరి. ఏమంటే, 'నాయనా! శాండిల్యా! తండ్రిగారి యానతిచొప్పున సిద్ధయువరాజు మిత్రావసువు ఈమలయపర్వతమందే ఎక్కడనో విద్యాధరులకు భవిష్యచ్చక్రవర్తియగు కుమార జీమూతవాహనుఁడున్నాఁడని విని, యాతనిఁ దనతోఁబుట్టువయిన మలయవతికి వరార్థమై పెండ్లిచూపు చూడఁబోయెను. అతనికోస మెదురుచూచుచుంటినా ఒకవేళ మధ్యాహ్నసమయము దాఁటి పోయినను బోవచ్చును. కనుక ఆమెను పిలుచుకొని రా" అని. కనుక గౌరీగృహమున కరిగి మలయవతినిఁ దోడఁ బిలుచుకొనివెళ్ళెదను. (పరిక్రమించి, భూమిని గుర్తుచూచి, వింతతో) అన్నా! ధూళి గదరిన యీ నేలను స్పష్టముగానున్న

యదుగులజాడ యెవ్వరిది? చక్రవర్తి చిహ్నములు (చక్రరేఖలు) గానవచ్చుచున్నవే. (ఎదుర జీమూతవాహనుని నిరూపించి) సందేహమెందుకు? ఈ మహాపురుషుఁడదే; ఇంక నేమన,

మ. పొలుపారెం దలపాగ శీర్షముపయిన్
భ్రూమధ్య మందూర్ణముల్
వెలుఁగెన్, గన్నులు తమ్మిరేకు లనఁ బో
ల్చెన్ జొమ్ము సింగమ్ము నా
నలరెన్, జక్రము లంఘ్రులందుఁ
గల వాహా యీతఁడీ భాగ్యచి
హ్నల విద్యాధర చక్రవర్తి పదముల్
ప్రాపింప కెట్లుండెడున్.

ఇంక సందేహింపఁ బనిలేదు. స్పష్టముగా నీతఁడు జీమూతవాహనుఁడే కావలెను. (మలయవతిని నిరూపించి) అన్నా! ఇదిగో యిక్కడనే రాచకన్నె గూడ నున్నది. (ఇద్దఱనుజూచి) పరస్పరము అనురూపముగానున్న యీ యిద్దఱను జతగూర్చె నా దైవము, ఇన్నాళ్లకు మంచిపని చేసినవాఁడగును. (చేరఁబోయి నాయకు నుద్దేశించి) అయ్యా! శుభమస్తు.

నాయకుఁడు—స్వామీ! జీమూతవాహనుడను నేను. అభివాదనము చేయుచున్నాను. (ఆయన లేవఁబోవును)

తాపసుఁడు—వలదు. లేవవలదు. "సర్వస్యాభ్యాగతో గురుః" అని గదా! మీరే మాకుఁ బూజ్యులు. కనుక సుఖముగాఁ గూర్చుండుఁడు.

నాయిక—అయ్యా! మ్రొక్కుచున్నాను.

తాపసుఁడు—బిడ్డా! భర్తను, అనురూపుఁ బడయుదువుగాక! రాజపుత్రి! కులపతులు కౌశికులవారు "మాధ్యందినసవనవేళ దాటిపోవుచున్నది గనుక వడిగా రమ్మ"నుచున్నారు.

మలయ—గురువులవారి సెలవైనట్లే వస్తున్నాను (లేచి నిట్టూర్చి, స్వగతము)

పద్యకము

గురువచన మొక్కపెడ గుంజుతున్నది నన్ను
ప్రియదర్శనేచ్ఛ వొకపెడ గుంజుతోంది
వెడలఁదోఁచదు, వెడలకుండుగఁదోఁచదు మన
స్సుయ్యాలవలె నాకు ఊగాడుతోంది.

(లజ్జతోను, అనురాగముతోను నాయకునిఁ బెడ నుగలి చూచుకొనుచు, తాపసునితో నాయిక, చేటి నిష్క్రమింతురు.)

నాయ —(ఉత్కంఠతో, నిట్టూర్చి వెళ్ళిపోవు చున్న నాయికను జూచుచు)

తే. పిఱుదు పెక్కువఁ దొట్రిల్లు చిఱునడకల
నవ్వలికి నేఁగుచున్న దీ పువ్వుఁబోణి
అవు, నయిన నేమి నా హృదయంబునందె
తప్పిపోకుండఁ దనదు పదంబు నిలిపె.

విదూ—చూడవలసినదేదో చూడడమైంది. కానీ యిప్పుడు మండుటెండదెబ్బను ఇబ్బడి అయినట్టుంది నా ఆకలిమంట, గబగబ మండుతోంది కనుక ఇక నిష్క్రమింతాము. నిష్క్రమిస్తిమా నేడు మునిజనములకు అతిథినయి వారిచ్చిన కందమూలఫలాదులతోనయినా యింత కడుపుమంట చల్లార్చుకొని ప్రాణాలు నిలుపుకొంటాను.

నాయ—(మీఁదికిచూచి) అన్నా! భగవంతుడు సహస్రపాదుఁడు ఆకాశమునడిమికి సూటిగా నడునెత్తిమీఁదికి వచ్చియున్నాఁడు.

సీ. ఎండవేడిమి సహింపఁజాలక మంచి
గందంపుఁజెట్ల ప్రకాండములను
రాసి, తద్రసము జారగనంటి చలితెలి
పూఁతగండములందుఁ బాదలనార్ద్రి
మగుమొగమ్మునఁ గర్ణయుగతాళవృంతమ్ము
లార్చి చల్లనిగాలి కూర్చుకొనుచు
ముత్తాటకొమ్మునంబోలెఁ దుండమున పై
నెరయశీకరములు సంచుకొనుచు

గీ. మదపుటేనిక రాగున్న యదిగో చూడు
వాడువాతెను సల్లకావనిజ మట్లు
మట్టమధ్యాహ్న మిపుడు సంప్రాప్తమయ్యె
నేఁగవలె వేగ మన మింక శాఁగదయ్య.

(నిష్క్రమించిరి)

---

# నాగానందము

## ద్వితీయాంకము

---

(అంతట చేటి ప్రవేశించును)

చేటి—మలయవతమ్మగారు నా కీలా గానతిచ్చారు. "ఒశే! మనోహారికా! మాఅన్నయ్యగారు మిత్రావసువుగారింతకింకా జాగుచేస్తున్నారె. కనుక నీవు వడిగావెళ్లి తెలుసుకొనిరా. వారు వచ్చినారో లేదోనూ" అని. వారి ఆనతి నెరవేరుస్తాను. (పరిక్రమించి యెరకేసి చూచి) ఎవర్తె ఈమె! వడివడిగా ఇటుకేసేవస్తున్నది. (ఆరచూచి) ఓహో! చతురికా యేమిటి!

(అంతట రెండవ చేటి ప్రవేశించును)

ప్రథమ—(చేరనరిగి) ఒశే! చతురికా! అదేమిటే, నన్నిట్లా కేటాయించి నీ వొక్కర్తె వే బుడ బుడా గడచిపోతున్నా వెక్కడికే?

రెండవది—(సమీపించి) ఒలే! మనోహరికా! మలయవతమ్మగారు నాకీలాగు సెలవిచ్చినారు. "అమ్మా! చతురికా! పూలకోత బడలికచేత నావా ళ్ళంతా కీళ్ళు గీళ్ళు విరగ్గొట్టేస్తున్నది. మబ్బు విడిచిన యెండలాగు కమ్ముకొనవున్న సంతాపం నన్ను చాలా కాల్చివేస్తున్నది. ఇందుచేత నీవు వెళ్ళి పిలకల మొవ్వటాకు కప్పుతో వున్న మోకగందపుతీగ లింటిలో చలువరాతిఅరుగు చక్కబెట్టి విరమ్మా" అని. వారు సెలవిచ్చిందంతా ననిపరచడమైనది. ఈ సంగతి ఇదుగో అమ్మగారికి మనవిచేయడానికి వెళ్తున్నాను.

ప్రథమ—అయితే వడిగా వెళ్ళివిన్నవించుకో. ఆమెగారక్కడికి విజయంచేస్తే తాపండుపశమిస్తుంది.

ద్వితీయ—(నవ్వి-స్వగతము) ఆమెగారి సంతాప మది యీలాంటివాటితో చల్లారేదిగాదులే! వింతలూ వేడ్కలూ గొల్పే మంచిగందపుతీగయిల్లు చొచ్చిచూస్తే ఆమెగారి సంతాపం మరింత అధిక మౌతుందేమో అనుకొంటాను. (ప్రకాశము) ఇక

నేనూ వెళ్ళి చలువరాయరుగు చక్క చేశానని అమ్మాయిగారికి మనవి చేసుకొంటాను.

(ఇది ప్రవేశకము)

(ఉత్కంఠితురాలై సులయవతి, చేటిక ప్రవేశింతురు) సులయవతి (నిశ్వసించి. తనలో) ఔంచవమా! అప్పుడాలాగు సిగుతో ఆపురుషుడిదగ్గరున్నండినన్ను ముఖంతప్పించి, నీవయితే అక్కడే అత్తుకుకూర్చుంటివే! అన్నా! నామంచేనాది అనే నీ తీరు. (ప్రకాశముగ) అమ్మా! చతురికా! అమ్మవారిగుడి యెక్కడో చూపించవే.

చేటి—అమ్మాయిగారు! గంధపుతీగలింటికి కాదండీ బయలుదేరిందీ?

నాయిక—(సిగ్గుతో) అమ్మా! మంచిదైంది. జ్ఞాపకపరిచావు. సరే, రా. అక్కడికే వెళ్ళుదాము.

చేటి—దయచేయండి, దయచేయండి అమ్మగారు.

(చతురిక, ఆ లతాగృహముగూర్చియే పోవును)

నాయిక—(తప్పుదారిని బట్టును)

చేటి—(వెనుకకు జూచి, కలకతోఁ దనలో) అన్నా! ఈమెగారికి మనసు మనసులో లేదు. ఆ అమ్మవారి గుడికేనే వెడుతున్నారేమిటీ? (ప్రకాశముగ) అమ్మాయిగారూ! ఇదిగో! ఇటుగాదటండీ మంచిగంధపుతీగలిల్లు! ఇట్టా వేంచేయండమ్మా.

నాయిక—(వెడనవ్వుతో నట్లే చేయుచున్నది)

చేటి—ఇదిగో! మంచిగంధపు తీగలిల్లు. లోపలికి వెళ్ళి చలువరాతి యరుగుమీఁద ఒళ్ళువాల్చి అలుపు తీర్చుకోండమ్మా.

(ఇద్దఱును గూర్చుందురు)

నాయిక—(నిట్టూర్చి తనలో) ఓ పూవింటి దేవరా! ఎవరిరూపు సౌరు నిన్ను ఓడగొట్టిందో వారిని నీవేమీ చేయలేకపోతివి. ఏ అపరాధమూ యెఱుగని నన్ను అబలనుగాజేసి ప్రహరిస్తున్నావు! సిగ్గుపడవూ? (తన్ను ఆరజూచుకొని-మదనావస్థను నటించుచు. (ప్రకాశముగ) అమ్మా! ఎందుచేతనే! చిగురుగుబురులు చిక్కగా కమ్ముకొని సూర్యకిరణాలను జొరనీయకున్నా మంచిగంధపు తీగలిల్లు నా వడదెబ్బ నొప్పును తొలగించలేకుండావుందే.

చేటి—(నవ్వుచు) నాకు తెలుసు ఈ సంతాప కారణం ఏమిటో. ఏంలాభం? నేను చెప్పితే మీరు ఒప్పుకోరు. మీరలా తలవటం లేదుగా.

నాయిక—(ఆత్మగతము) ఏమి! నాగుట్టు కని పెట్టిందా యేమిటిది? అయినా అడిగి చూస్తాను. (ప్రకాశముగ) అమ్మీ! ఏమిటిది? ఏమిటే ఆవప్పా కొంది? ఏమిటే నీకు తెలిసింది? చెప్పా చూదాము ఆ కారణ మేమిటో?

చేటి—అదుగోనమ్మా! నీ మనసులోని వర సిద్ధి.

నాయిక—(సంభ్రమముగా రెండు మూడడు గులు నడచి) ఏరీ! ఏరీ! వా రెక్కడ?

చేటి—(లేచి నవ్వుతో) అమ్మాయిగారూ! వారంటున్నా రేమిటండీ! ఎవరండీ వారు?

నాయిక—(సిగ్గుతో గూర్చుండి తలవంచు కొనును)

చేటి—అమ్మాయిగారూ! ఇదేనమ్మా నే నక్కడ చెప్పదలచుకొంది. నీ మనసులో గుదురు

కొన్న వరస్వరూపాన్నే యీ అమ్మవారు మీకు స్వప్నంలో అనుగ్రహించారండీ. ఆ వరస్వరూపమే తరువాత పువ్వుటమ్ముల విడిచివచ్చిన మదనుడి లాగ అమ్మాయిగారికి అగపడడమూ జరిగింది. అదే యీ సంతొషానికి కారణం. దానిచేతనే సయానా చలువలుగురిసే యీమంచిగంధపు తీగ లిల్లు మీసంతాపదుఃఖాన్ని చల్లార్పలేకపోతున్నది.

నాయిక—(చతురిక ముంగురులను ముట్టుచు) అమ్మో! చతురికవు గావటే నీవు. నీదగ్గర యింకా దాచేదేమిటి? కనక చెప్పేస్తాను.

చేటి—అమ్మాయి గారూ! ఇప్పుడే చెప్పాను కదూ: ఎందుకమ్మా వందమాటలు? సంభ్రమమూ వద్దు—కామ సంతాపమూవద్దు. నేను చతురికనే అయితే వారుకూడా అమ్మాయిగారిని చూడకుండా క్షణమాత్రమైనా ఇతరవిధంగా సంతోషం పొంద లేరు. ఇదికూడా నేను పరిశీలించిందే.

నాయిక— అమ్మో! మనకంతటి అదృష్టం కూడానటే!

చేటి—అమ్మాయి గారండీ! అట్లా అనకండి. నారాయణమూర్తి రొమ్మునైన లక్ష్మీఅమ్మవారిని నలుపుకొనక ఉబుసు పుచ్చుకొంటాడా?

నాయిక—తనవాళ్ళు తనకు మంచినేగాక మరొకటి మాటాడుతారటే! చెలీ! అందుచేతకూడా సంతాపం నన్నధికంగా బాధిస్తుందే. ఏమంటే ఆ మహానుభావుల్ని నేను మాట మాత్రానైనా సన్మానించక పోతిని. మర్యాద మన్ననల నెఱుగని పెడసంపు దాన్నిగా నన్ననుకోగలరు (అని కన్నీరు గార్చును)

చేటి—అమ్మాయిగారూ! కన్నీరు తెచ్చుకోకండి. అవును ఎట్లు కన్నీరు తెచ్చుకోకుండా ఉంటారు? ఈమెను హృదయసంతాపం ఎంతో అధికంగా బాధిస్తున్నది. అందుచేత నేనిప్పుడేమి చేసేది? మంచిగంధపు చిగురాకుల రస మీమె గుండెకు రాస్తాను (లేచి గంధపుచిగురాకు తీసి, పిండి, రసము హృదయమునకు రాయును) అమ్మాయిగారూ! కన్నీరు తెచ్చుకోకండని చెబుతున్నానుగదా! స్తనవర్తుల దత్తమైన ఈచందనపు

చిగురాకుల రసం ఎడతెఱిపి లేకుండా కారేకన్నీటి చుక్కలచే వెచ్చనై మీహృదయ సంతాపాన్ని పోగొట్టజాలసిదౌతుంది. (అరటియాకు తెచ్చి విసరును.)

నాయి—(చేతితో నామెను సవారించును) చెలీ. విసరకే ఈ అరటాకుల గాలి చాలా వెచ్చగా ఉన్నది.

చేటి—అమ్మాయిగారూ! దీనియందు దోష మెన్న బోకండి.

దట్టమౌ లేత గంధపు చివుళ్ళను గూడి
అతి చల్లనైన ఈఅరటి ఆకులగాలి
నిరతమ్ము వెడలించు నిట్టూర్పు గములచే
ఎవ్వరూకాదు మీరే వెచ్చ చేసేరు.

నాయి—(కన్నీళ్ళతో) ఈసంతాపం చల్లారే ఉపాయమేమైనా ఉన్నదా?

చేటి—అమ్మాయిగారూ! లేకేమి, వారే ఇచ్చటికి వచ్చినట్లైతే.

(అంతట నాయకుఁడును, విదూషకుడును
ప్రవేశింతురు.)

నాయకుఁడు—

ఉ. చింకలతోఁళు లాత్రిమువుఁ
జెట్టుల వ్రేలఁగఁ గట్టిరేమొ యన్
శంక జనింప నల్ల తెల
చాయలచూడ్కుల మోము త్రిప్పి నా
వంక వెలార్చి యేసె నల
వామవిలోచన మాని మ్రోల నే
యింక ఝుషాంక! యేమిటికి
నేసెదవో సుమబాణముల్ వృథా.

విదూ—మిత్రుఁడా! నీ ధీరత్వమంతా ఏమై పోయింది?

నాయ—వయస్యుఁడా! సహజముగా నేను ధీరుఁడనే కదా!

ఉ. రాచితి నచ్చు వెన్నెలల
రాత్రుల మాలతి పూల వాసనల్

త్రేచెడు సంజ తెమ్మెరలఁ
ద్రెక్కొనఁగల్గితిఁ గల్వలోర్కి నుూ
చూచితి గండుఁదుమ్మెదల
ఝుంకృతి వింటిఁ గొలంకులందు న
న్నో చెలికాఁడ! యేటికనె
దోయి! అధరుఁడ నంచు నోగుగా!

(ఆలోచించి) లేదా మిత్రుఁడు లెస్సగా వచించినాఁడు. నిజముగానే నధీరుఁడనే యైతిని

గీ. అంగనాహృదయుఁడనై యనంగుఁ డేయు
పువ్వుఁదూపులకే బిట్టు పొగులుచుంటి
నిట్టివాఁడనై యుండి నీ యెట్టయెదుట
నెట్టు ధీరుండ నని వచియింపఁ గలను?

విదూష—(తనలో) ఈవిధంగా అధీరత్వం ఒప్పుకుంటూ ఇత డధికమైన హృదయావేగం వెల్లడించాడు. ఇప్పుడింకుండి ఇతణ్ణి మరలించడ మేలాగు. (ప్రకాశముగా) మిత్రమా! ఈనాడు గురుజనుల శుశ్రూష ఇంత వేగంగా ముగించి వచ్చావెందుకు?

నాయ—మిత్రమా! నీప్రశ్న మిక్కిలి యుచితముగానున్నది. ఇతరుల కెవ్వరికిది చెప్పఁదగినది? ఈనాఁడిట్లు కలగంటిని-ఆ ప్రియురాలు (వేలితోఁ జూపుచు) ఈచందనలతా గృహమునఁ జంద్రకాంతమణి శిలపైఁ గూర్చుండి ప్రణయ కోపముచే నన్నేదో యుపాలంభించుచున్నట్లుద్భుచు నాచేఁ జూడఁ బడినది. అందుచే స్వప్నానుభూతమైన ప్రియాసమాగమముచే రమణీయమైన యీచోటనే దినశేషమును గడపఁ గోరుచున్నాను. కావున రమ్ము వెళ్ళుదము.

విదూ—రా! రా! (ఇరువురును బరిక్రమింతురు.)

చేటి—(చెవియొగ్గి ససంభ్రమముగా) అమ్మాయిగారూ! అడుగులు చప్పుడులా వినబడుతోంది.

నాయిక—(సంభ్రమముతోఁ దన్నుఁ జూచుకొనుచు) ఇట్టి నా ఆకారం చూచి ఎవ్వరూ నా హృదయం శంకించకుందురు గాక! అందుచే లే. ఈ ఎత్తు అశోకపు చెట్టుచాటున ఉండి ఈయన ఎవ్వరో చూదాము.

చేటి—ఇదే చందనలతాగృహం. ప్రవేశిద్దాం రండి!

(నాట్యముతోఁ బ్రవేశింతురు)

నాయక—(చూచి)

గీ. చందనలతాగృహం బిది చంద్రకాంత
శిలలు దాఁపినదయ్యె నా చిత్తమునకుఁ
జలువ గొలుపద చందాస్య వెలయునికిఁ
జంద్రికా శూన్యమైన నిశాముఖమున.

చేటి—(చూచి) అమ్మాయి గారూ! మీా అదృష్టం పండింది. మీా హృదయ వల్లభుడైన ఆయనే యీాయన.

నాయిక—(చూచి సంతోష సాధ్వసము లతో) ఓసీ! ఈయన్ని చూచి అతి భయంచేత వాపుగా ఇక్కడనే నిల్చుటకు చాలకుండా ఉన్నాను. ఒకప్పుడీయన నన్ను చూడగలరు. అందుచే ఇంకో చోటికి వెడదాము. (ఉత్కంపముతో నడుగు వేసి) చెలీ! నా ఎడమతొడ అదరుచున్నదే.

చేటి—(నవ్వి) పిఱికిదానా! ఇచ్చటఉన్న నన్నెవ్వరు చూస్తారు? ముందున్న ఈ ఎఱ్ఱ అశోకపు చెట్టును మఱచిపోతివా ఏమి? ఇక్కడే కూర్చుందాము. (అట్లు చేయుదురు)

విదూ—(నరూపించి) మిత్రమా! ఇదే ఆ చంద్రకాంత శిల.

నాయ—(కన్నీళ్ళతో నిట్టూర్పు పుచ్చును.)

చేటి—అమ్మాయిగారూ! మాటలుకూడా వినబడుతున్నాయి. అందుచే అక్కడే మనసుంచి విందాము. (ఇరువురు వినుచుందురు.)

విదూ—(చేతితోఁ గదల్చుచు) మిత్రమా! ఇదే ఆ చంద్రకాంతశిల అని చెబుతున్నాను.

నాయ—మిత్రమా! నీవు తెన్నగాఁ బలికించితివి. (చేతితోఁ జూపుచు)

ఉ. వామకరంబునన్ వెలరు
వారిన మోమునవాల్చి యొంతకున్
రామికి నన్గుఱించి యుద
రం బదరన్ వెత పైకిఁ దోఁపఁగాఁ

దా మది రోష మాచుకొని
తద్దయు నూర్చుచు నేడ్చుచున్న యా
రామను గన్న డీ చలువ
రాతివితర్దికమీఁదనే చుమా!

కావున నా చంద్రకాంత వితర్దికమీఁదనే కూర్చుం దము. (ఇరువురును గూర్చుందురు.)

నాయి—ఒసే! ఆమె ఎవతై ఉంటుంది?

చేటి—అమ్మాయిగారూ! మనం చాటుగా ఉండే యీాయన్ని చూస్తున్నాం కాబట్టి మీ మ్మాయన చూడ లేదనుకుంటాను.

నాయి—అది సరే! మఱి ప్రణయకుపితమైన యే ప్రియజనాన్ని మనసులో ఉంచి ఆయనమాటాడు తున్నారు?

చేటి—అమ్మాయిగారూ! ఈ విధంగా సందే హించకండి. మళ్ళీ విందాము.

విదూ— (తనలో) ఇత డీ కథచే మిక్కిలి రంజిల్లుతున్నాడు. అగుగాక! దానినే మరల పలికి

స్తాను. (ప్రకాశముగా) మిత్రమా! అప్పు డేడు స్తున్న ఆమెతో నీ వేమని పలికావు?

నాయ—మిత్రమా! ఇట్లు పలికితిని.

కన్నీరు నీ వోడ్చఁగా నెలరాతి
తిన్నె గన్గొంటినే తెలివ నీమోము
పున్నమ నెలపొడుపున నుబ్బరించి
చన్నీరు జాల్వార్చు చాడ్పున నుండె.

నాయి—(కోపముతో) ఇంతకంటెను విన దగ్గదేముంది? (కన్నీటితో)అందుచే రా. పోదాము.

చేటి—(చేయిపట్టుకొని) అమ్మాయిగారూ! ఈలా పలకకండి! మిమ్మల్ని చూచినవా రింకొ కటి పలుకుతా రని నా హృదయం నమ్మకుండా ఉన్నది. కావున కథముగిసేదాకా వేచిఉందాము.

నాయ—మిత్రమా! ఈ శిలపై నామెనే చిత్రించి ఆమెచేఁ జిత్రగతమైన యాత్మను వినోద పఱుచుకోఁ గోరుచున్నాను. అందుచే నీగిరితటము నుండి మణిశిలాశకలములను దీసికొని రమ్ము.

విదూ.—నీ వాజ్ఞాపించినట్లే. (పరిక్రమించి - వానితో సమీపించి) మిత్రమా! నీ వేదో ఒక రంగే తెమ్మని ఆనతిచ్చావు. నేనైతే ఈకొండ మీద సులభాలైన ఐదుగకాల రంగులు తెచ్చాను. అందుచే ఇంక చిత్రించు. (రంగులను దగ్గఱఁ బెట్టును)

నాయ.—మిత్రమా! లెస్సగా నాచరించితివి. (గ్రహించి శిలపై నామెను లిఖించుచు గగుర్పాటుతో) మిత్రమా! చూడు. చూడు.

అక్లిష్ట బింబశోభాకర మ్మైనచుఁ
గనులపండువు కూర్చు కాంతనెమ్మోము
రేఖ, చంద్రునిరేఖరీతి తోడ్తోఁ
జూడంగఁబడినదై సుఖ మిచ్చు మనకు.

(అని లిఖించును)

విదూ.—(కౌతుకముతోఁ జూచి) పరోక్షంగా కూడా రూప మీలా లిఖించావు. అహా! ఏమాశ్చర్యము!

నాయ—(చిఱునవ్వుతో) వయస్య! ఇం దాశ్చర్య మేమి?

గీ. భావనం జేసి యెదుట నిల్పంగఁబడుట
నిజము ప్రియురాలు నాకు సన్నిహిత యయ్యెఁ
దడవతడవకుఁ జూచి చిత్రమున నీమె
వ్రాయుచుండంగ నిందు చిత్రంబు గలదె?

నాయి—(కన్నీళ్లతో) చతురికా! కథఅంతా తెలిసిందికదా! ఇంక రా, మిత్రావసువును చూడడానికి వెడదాము.

చేటి—(విచారముతో తనలో) ఏమి! ఈమె మాటలు జీవితమం దాశ లేనట్టుగా కనబడుతున్నాయి. (పైకి) అమ్మాయిగారూ! అక్కడికి మనోహారిక యిదివఱకే వెళ్ళిందిగదా! అందుచే ఒకప్పుడు మిత్రావసువుగా రిక్కడికే రావచ్చును.

(అంత మిత్రావసువు ప్రవేశించును)

మిత్రా—శంద్రిగారిచే నీవిధముగా నాజ్ఞాపింపఁబడితిని "వత్సా! మిత్రావసూ! కుమారజీమూతవాహనుఁ డిక్కడికి సమీపముననే యుండి

మనచేఁ బరీక్షితుఁడై యోగ్యవరుఁడుగా నిర్ణయింపఁ బడినాఁడు. అందుచే నతనికి మలయవతి యీయఁ బడుఁగాక" అని. స్నేహాపరాధీనుఁడనైన నేను మాత్ర మనస్థాంతర మనుభవించుచున్నాను. ఏల యన?

శా. ఆ విద్యాధర రాజవంశతిలకం
బాకారవిద్యా వయః
శ్రీవిఖ్యాతుఁడు నార్జవోర్జితుఁడు, న
ర్థిన్ బ్రాణరక్షార్థమై
జీవంబే నిడుదాత, యాతనికి సు
శ్రీరాశి, నా సోదరిన్
దేవింగా నిడు టన్న నా మనసు ప్రీ
తిఁ భీతి నట్టాడెడిన్.

జీమూత వాహనుఁ డిచ్చటనే గౌర్యాశ్రమసంబద్ధమైన చందనలతాగృహమున నున్నాఁడని వింటిని. అందుచే నా చందనలతాగృహమునే ప్రవేశించెదను. (అని ప్రవేశించును)

విదూ— (ససంభ్రమముగా నవలోకించి) మిత్రమా! ఈ అరటాకుతో బొమ్మలో ఉన్న ఈ

కన్యకను కప్పు. లేకపోతే ఇక్కడికివచ్చిన సిద్ధయువ రాజైన మిత్రావసువు దీని నొకవేళ చూడవచ్చు.

(నాయకుఁడు కదళీపత్రములోఁ జిత్రము నాచ్ఛాదించును)

మిత్రా—(ప్రవేశించి) కుమార! మిత్రావసువు ప్రణమిల్లుచున్నాఁడు.

నాయ—(చూచి) మిత్రావసూ! స్వాగతము. ఇటఁ గూర్చుండుము.

చేటి—అమ్మాయిగారూ! మిత్రావసువుదొర గారు వచ్చారు.

నాయి—చెలీ! నాకు ప్రియంగా ఉన్నది.

నాయ—మిత్రావసూ! సిద్ధరాజువిశ్వావసువు కుశలియై యున్నాఁడా!

మిత్రా—తండ్రిగారు కుశలముగానే యున్నారు. వారి యానతిచేతనే నీచెంత కరుదెంచితిని.

నాయ—పూజ్యుఁడేమని సెలవిచ్చినాఁడు?

నాయి—(తనలో) తండ్రిగారేమని సందేశం పంపారో వింటాను.

మిత్రా—తండ్రిగారిట్లు చెప్పినారు: "నాకు మలయవతి యను పేరుగల కూఁతురున్నది. ఈ సిద్ధ రాజాన్వయమున కెల్ల నామె ప్రాణము ప్రాణము వంటిది. ఆమెను నేను నీకిచ్చుచున్నాను. గ్రహింప వలెను" అని.

చేటి—(నవ్వి సంతోషముతో) అమ్మాయి గారూ! ఇప్పు డెందుకు కోపించకుండా ఉన్నారు?

నాయి—(చిరునవ్వుతో సిగ్గుతో ముఖము వంచి నిలఁబడి) చెలీ! నవ్వబోకు. ఈతని అన్య హృదయత్వం మఱచిపోతివా యేమి?

నాయ—(అపవారించి) మిత్రమా! సంకట మందుఁబడినవార మైతిమి.

విదూ—(అపవారించి) ఆమెను విడిచి యింకొకతెయందు నీమనస్సు రమించదని నాకు తెలుసు. అందుచే ఏదోవిధంగా సమాధానం చెప్పి యితణ్ణి పంపించు.

నాయి — (కోపముతో-తనలో) హా తాపసుడా! ఇది యెవరికి తెలియదు?

చేటి — అమ్మాయిగారూ! ఊఱడిల్లండి-ఊఱడిల్లండి.

విదూ — ఆర్యా! ఇతను పరాధీనుడుగదా! ఇతన్ననుమయిస్తే ఏమిలాభం? ఇతని తల్లిదండ్రులను వెళ్ళి అడగండి.

మిత్రా — (తనలో) ఇతఁడు లెస్సగాఁ జెప్పినాఁడు. ఈయన గురుజనులు వచన మతిక్రమింపఁడు. ఈయన తండ్రిగారుకూడ నీ గౌర్యాశ్రమమందే వసించుచున్నారు. అందుచే నచ్చటికేగి యీయన పితరులకు మలయవతిని బ్రతిపాదించెను.

(నాయిక ఊఱడిల్లును)

మిత్రా — (ప్రకాశముగా) ఈ విధముగా హృదయము నివేదించిన మమ్ముఁ బ్రత్యాఖ్యానించుట కుమారునికే లెస్సగాఁ దెలియును.

నాయి—(సరోషముగా నవ్వి) తిరస్కారంచే తేలికపడికూడా మిత్రావసువు మళ్ళీ ఏదో మాటాడుతున్నాడు.

(మిత్రావసువు నిష్క్రమించును.)

నాయి—(తనలో-కన్నీళ్ళతోఁ దన్ను జూచుకొనుచు) దౌర్భాగ్య కళంకమలినమున్నూ, దుఃఖ భాజనమున్నూ అయిన ఈ శరీరం ధరించడంవల్ల నాకేం ప్రయోజనం? అందుచే ఈఅశోకపుచెట్టుకు ఈ అతిముక్తలతతో బంధించుకుని ఉరిపెట్టుకుంటాను. ఇంతకన్నా ఏమున్నది (ప్రకాశముగా సిగ్గుతోఁ గూడిన నవ్వుతో) చెలీ! మిత్రావసువు దూరం వెళ్ళినాడో లేదో చూడు. నేను కూడా ఇక్కడనుంచి వెళతాను.

చేటి—(కొన్ని యడుగులు నడచి—చూచి—తనలో) ఈమె మన స్సింకోవిధంగా ఉన్నట్లు కనబడుతోంది. అందుచే నేను ముందుకు వెళ్ళకుండా, ఇక్కడనే చాటుగా ఉండి, ఈమె ఏంచేస్తుందో చూస్తాను.

నాయి:—(దిక్కులుచూచి, పాశము చేత గ్రహించి, కన్నీళ్ళతో) భగవతి! గౌరి! ఈజన్మలో నీవు నాయం దనుగ్రహం చూపకపోయినా, ఇంకో జన్మలోనైనా ఈవిధంగా దుఃఖభాగినిని కాకుండు నట్లుగా చెయ్యి. (కంఠమునఁ బాశ మర్పించును)

చేటి—(చూచి ససంభ్రమముగా సమీపించి) రక్షించండి. రక్షించండి! ఈ రాజకుమారి చెట్టుకు కట్టుకుని ఉరిపోసుకుంటున్నది.

నాయ—(ససంభ్రమముగా సమీపించి) ఆమె యెక్కడ! ఆమె యెక్కడ!

చేటి—అదిగో; అశోకవృక్షందగ్గర.

నాయ—(సహర్షముగాఁ జూచి) ఏమి! ఈమె నాకోరికలకు నెలవైన యా యెలనాగయే. (నాయికను జేతగ్రహించి పాశమును దొలఁగించును)

గీ. వలదు వల దిట్టి సాహసంపాటు ముగుద!
తీయు మీ చిగురాకుఁ గేల్తీవనుండి
వనలు కోయుటకైనఁ జాలనిది యిప్పు
డె ట్లురికిఁ బాశమును వహియింపఁగలదు.

నాయి—(భయముతో) చెలీ! ఈతడెవరు? (లెస్సగా నిరూపించి రోషముతోఁ జేయి తొలఁగించును) ఓయీ! ముంజేయి విడిచిపెట్టు. నివారించడానికి నీవెవడవు. మరణించడానికికూడా నీఅజ్ఞ కావలయునా యేమి?

నాయ—

హారలతికొఁ చిత మ్మగునటుత నీవు
పాశ మర్పించుటకుఁ దొడు పడినకతన
నెంతొ నేర మొనర్చి గ్రహింపఁబడిన
పాణి యియ్యది యెటు విడువంగఁ బడును?

విదూ—(చేటిని సమీపించి) ఈమె యీ విధంగా మరణప్రయత్నం చేయడానికి కారణమేమిటి?

చేటి—నీ నెచ్చెలికాడేకదా!

నాయ—ఏమి! ఈమె మరణవ్యవసాయమునకు నే నా కారణము; నా కది యేమాత్రమును దెలియదుగదా!

విదూ—ఏమమ్మా! ఎట్లు.

చేటి—(సాకూతముగా) నీ చెలికాడే తనప్రాణ ప్రియురాల్ని చిత్రపటంలో లిఖించి ఆమెమీది పక్షపాతంచేత మిత్రావసువు ప్రతిపాదిస్తూఉన్నను తన్ను గ్రహింపలేదని నిరాశుడై యీమె యీ ప్రయత్నం చేసింది.

నాయ—(సంతోషముతో — తనలో) ఈమె యేనా విశ్వావసువుకూఁతురైన యీ మలయవతి? కానిచో రత్నాకరమునఁ దప్పఁ జంద్రలేఖ మఱెచ్చట జనించును? ఈమెచే నే నెట్లు వంచితుఁడ నైతిని?

విదూ—అట్లైనచో ఇప్పుడు నా చెలికాడు నిరపరాధుడే. బొమ్మలో లిఖింపబడ్డదీమెయే. ఒకవేళ నామాటమీద నమ్మకంలేకపోతే స్వయంగా వెళ్ళి శిలాతలంమీద చూడు. (నాయిక లజ్జాహర్షములతో నాయకునిఁ జూచుచు హస్తమును దివియును)

నాయ—(చిఱునవ్వుతో) శిలాతలము మీఁద లిఖింపఁబడిన నా హృదయ వల్లభను జూచువఱకు దీనిని విడిచిపెట్టను.

(అందఱును జందనలతాగృహము ప్రవేశింతురు)

విదూ—(అరటియాకు తొలఁగించి) పూజ్యురాలా! ఈతడికి ప్రాణప్రియురాలైన ఈమెను చూడు చూడు.

నాయి—(నిరూపించి — అపవారించి — చిఱునవ్వుతో) చతురికా! నేనువలె లిఖింపబడ్డది.

చేటి—అమ్మాయిగారూ! నేనువలె లిఖింపఁబడ్డదంటారేమి? దీనిపోలిక యేలాఉన్నదంటే మణిశిలమీద మీ ప్రతిబింబమే సంక్రమించిందో లేక మీరే లిఖింపఁబడ్డారో తెలియడంలేదు.

నాయి—(నవ్వి) బొమ్మలో చిత్రింపఁబడ్డనన్ను చూపుచున్న ఇతగాడిచే దుర్జనురాలుగా చేయఁబడ్డాను.

విదూ— మిత్రమా! నీకిప్పుడు గాంధర్వ వివాహం సర్వోత్తమైంది. అందుచే ఆమె ముంజేయి విడిచిపెట్టు. ఈమెయెవ్వరో బుడబుడా ఇటే వస్తూఉన్నది.

(కొంచెమునవ్వినాయకుఁడు నాయికనువిడుచును)

(చేటి ప్రవేశించును)

చేటి——(హర్షముతో తొందరగాసమీపించి) అమ్మాయిగారూ! అదృష్టంచే వర్ధిల్లుతున్నారు. జీమూతవాహన ప్రభువుగారి పితరులచే మీరంగీకరింపబడ్డారు.

విదూ——హీహీ! ప్రియవయస్యుని మనోరథాలు సిండారాయి. కాదు, కాదు. మలయవతమ్మగారివి, లేక వీరిద్దరివీకావు బ్రాహ్మణుణ్ణైనా ఒకడినివే.

చేటి—— (నాయిక నుద్దేశించి) యువరాజు మిత్రావసువుగారిచే ఇట్లాజ్ఞాపింపబడ్డాను. "నేడే మలయవతీవివాహమంగళం కాగలదు. అందుచే తొందరగావెళ్ళి ఆమెను తీసుకొనిరా" అని. అందుచే రా, వెళదాము.

విదూ——ఓసి! దాసికూతురా! ఆమెను తీసుకు వెళ్ళుతున్నావా? మామిత్రుడిక్కడే ఉండిపోవలెనా?

చేటి——(నవ్వి) హాతాశుడా! తొందరపడకు. మీకున్నూ స్నానకాలం సమీపించింది.

(నాయిక సానురాగలజ్జముగా నాయకునిఁ జూచుచుఁ బరివారముతో నిష్క్రమించును.)

(నేపథ్యమున వైతాళికుఁడు పఠించును)

మ. కలుగం జేయుచుఁ జందనాద్రికిని బు
    ష్కావాన మేరుద్యుతిన్
బొలయం జేయుచుఁ జెందిరంపుఁబొడి ని
    ప్పున్ సాంధ్యసౌందర్యమున్
విలసన్నూపుర నిస్వనానుగత త
    న్వీ హృద్యగీతాళిచేఁ
దెలుపు స్సిద్ధజనమ్ము నీ పరిణయా
    దిస్నానవేళావధిన్.

విదూ.—(విని) మిత్రమా! అదృష్టంచే స్నాన వేళ వచ్చినది.

నాయ.—(సంతోషముతో) మిత్రమా! అజ్ఞ నచో నిచ్చట నుండుటవలన ఫలమేమి? రమ్ము మనముకూడఁ దండ్రిగారికి నమస్కరించి స్నాన భూమికే యేగుదము.

క. సమరూప కుల వయో భా
గములను నన్యోన్యకృతవిగాఢప్రీతిం
గొమరారుపుణ్యవంతుల
కమరుం గొందఱికె సంగమానంద మిలన్.

(అందరు నిష్క్రమింతురు)

---

# నాగానందము

## తృతీయాంకము

---

(అంత మత్తుఁడు, విచిత్రవిహ్వాలవేషుఁడు, చషక హస్తుఁడు నైనవిటుఁడును బుజముమీఁదఁ గల్లు కుండ పెట్టుకొని చేటుఁడును బ్రవేశింతురు.)

విటుఁడు—(సంతోషముతో)

*కాముకులజంటలను కలగూర్చునొక్కఁడు
తన్నే మరచి తప్పదాగు సంకోకడు
కామదేవుఁడు వాఁడు కామపాలుడు వీఁడు
సాము లిద్దరె నాకు సందేహ మేలా.

---

పాఠాంతరము

*క. సుర నెపుడు త్రాగువాఁడును
నరులకుఁ బ్రియసంగమం బొనర్చెడువాఁడున్
హరియగ్రజుండు, మనసిజుఁ
డిరువురె దైవంబు లంచు నే నూహింతున్.

గీ. వక్షమంతయు దయిత వక్త్రమ్మునన్నల్ల
కలువతావి నుల్లసిలెడు మదిర
మౌళిశేఖరకము మానక తాల్చు నీ
శేఖరకుని మనకి సిద్ధమకద!

(తూలుచు) అరే! ఎవడురా నన్ను కదల్చేవాడు. తప్పక నవమాలికే నాతో మేలమాడుతోం దనుకుంటాను.

చేటుండు—దొరా! ఇప్పటికూడా నవమాలిక రాకుండా ఉన్నది.

చేటుండు—(రోషముతో) మలయవతి వివాహమంగళం తొలిజామునసే అయిపోయింది. ఇప్పుడు తెల్లవారినప్పటికీ ఇంకా ఆమె రాలే దెందు చేతనో? లేదా ఇప్పుడు మలయవతి పెండ్లి వేడుక సమయంలో సిద్ధవిద్యాధర జను లందఱూ తమ తమ ప్రియురాండ్రతో కుసుమాకరోద్యానంలో త్రాగుడుసౌఖ్యం అనుభవిస్తున్నారని అనుకుంటాను. నవమాలిక నా కోస ఎదురుచూస్తూ అక్కడే ఉంటుంది. అందుచే నేకూడా అక్కడికే వెడతాను.

నవమాలిక లేకుండా శేఖరకసౌందర్య మనగా నెట్టిది? (తూలుచుఁ బరిక్రమించును)

చేటి—రండి రండి దొరగారూ! ఇదే కుసు మాకరోద్యానం. ఇందులో ప్రవేశించండి.

(ఇరువురును ప్రవేశము నటింతురు.)

(అంత బుజమునఁగల వస్త్రములజతతో విదూష కుఁడు ప్రవేశించును)

విదూ—ఇప్పుడు ప్రియమిత్రుఁడు కుసుమాకరో ద్యానానికి వెడతా డని విన్నాను. అందుచే అక్క డికే వెడతాను. (పరిక్రమించి చూచి) ఇదే కుసు మాకరోద్యానం. ఇంక ప్రవేశిస్తాను. (ప్రవేశించి భ్రమరబాధ నటించుచు) అరే! ఈ దుష్ట మధుకర సమితి నన్నే పీడిస్తున్న దెంచేతనో? (తన్ను వాసన చూచుకొని) ఔను. తెలిసింది. మలయవతి చుట్టా లచే అల్లుడుగారి నెచ్చెలికాణ్ణని గౌరవపూర్వకంగా సుగంధవర్ణకాలచే అలంకరింపబడ్డాను. సంతానక శేఖరకముకూడా నా తలమీద ముడువబడింది. ఆ అత్యాదరమే ఇట్లు కీడుకు కారణమైంది. ఇప్పు

డేమి చేయను? మలయవతిదగ్గఱనుంచే పొందిన ఈ ఎఱ్ఱఉత్తరీయాలజంటచే స్త్రీవేషం ధరించి కందువా ముసుగువేసుకుని వెడతాను. ఈ తోఁట్ట కొడుకు దుష్టమధుకరసమూహాలు న న్నేమి చేస్తాయో చూస్తాను. (అట్లుచేయును)

విటు.—(నిరూపించి, సంతోషముతో) అరే! చేటుడా! (వ్రేలితోఁ జూపుచు, నవ్వుతో) ఇదిగో నవమాలిక నన్నుజూచి నేను ఆలస్యంగా వచ్చానని అలకముసుగు వేసుకుని ఇంకోచోటికి వెడుతోంది. అందుచే ఆమె కంఠం కౌఁగిలించుకొని అనునయిస్తాను. (తొందరగా సమీపించి, విదూషకుని కంఠము గ్రహించి, తాంబూలమీయఁ గోరును.)

విదూ.—(మద్యగంధముసూచించుచు) అరే! దూరంగా పో! దూరంగా పో! (అని ముక్కు మూసికొని పెడమొగముగా నిలిచి) ఆ దుష్టమధుకరాలబారినుండి తప్పించుకుని ఇప్పు డింకో దుష్టమధుకరం వాతపడ్డా నేమిటి?

విటు.—ఏమి! ఈమె కోపంచే పెడమొగమైంది. (ప్రణామము చేయుచు విదూషకుని పాద

ములు తన తలమీఁదఁ బెట్టుకొని) శాంతించు నవమాలికా! శాంతించు.

(అంతఁ జేటి ప్రవేశించును)

చేటి — మలయవతమ్మగారి తల్లిగారిట్లా ఆజ్ఞాపించారు! "ఒసే! నవమాలికా! కుసుమాకరోద్యానానికి వెళ్ళి ఉద్యానపాలితయైన పల్లవికతో "ఈనాడు తమాలవీథిని ఎక్కువగా అలంకరించును. మలయవతితోకూడా అల్లుడుగారక్కడికి వెడతారని చెప్పు" అని పల్లవిక నాచే ఆజ్ఞాపింపబడ్డది. ఇంక రాత్రి ఎడబాటుచే కలిగిన ఉత్కంఠచే బాధపడుచున్న ప్రియవయస్యుడైన శేఖరకుణ్ణి వెతుకుతాను (చూచి) ఇదుగో శేఖరకుఁడు (రోషముతో) ఇదేమిటి? ఇంకో స్త్రీ నెవతెనో అనునయిస్తున్నాడు. అందుచే ఇక్కడే నిల్చి ఈమెయెవ్వరో తెలుసుకుంటాను.

విటు — (హర్షముతో)

గీ. వారిజాసన హరి మహేశ్వరుల కైన
నెవఁడు గర్వముమై ద్రొక్క నెఱుఁగఁ డెపుడు

నట్టి శేఖరకుండు నీ యడుగుఁదమ్ము
లందు నవమాలికా! ఇప్పు డవనతుఁడగు.

విదూ—ఓరి తొొత్తుకొడకా! మత్తబాలక! ఇక్కడ నవమాలి కెక్కడిదిరా!

చేటి—(నిరూపించి, చిఱునవ్వుతో. నే నను కుని మదపరవశుడైన శేఖరకుఁడు ఆత్రేయయ్య వారి ననుయిస్తున్నాడు కాబోలును. అందుచే ఇప్పుడు లేనికోపం తెచ్చుకుని వీళ్ళిద్దరినీ పరిహా సిస్తాను.

చేటుఁడు—(చేటిని జూచి శేఖరకుని జేతితో గ్రహించి కదల్చుచు) దొరగారూ! ఈమెను విడ వండి. ఈమె నవమాలిక కాదు. ఇదిగో నవమాలిక అలకచే ఎఱ్ఱబడ్డకళ్ళతో చూస్తూ ఇటే వస్తూ ఉన్నది.

చేటి— (స మీ పిం చి) శేఖరక! ఈమె ఎవరు? అనునయిస్తున్నావు?

విదూ—(ముసుగుతీసి) నేను! దురదృష్టవంతు రాలికొడుకును.

విటుఁడు—(విదూషకుని సరూపించి, రోష ముతో లేచి) అరే! కపిల మర్కటమా! నీవుకూడా నన్ను శేఖరకుణ్ణి మోసగిస్తున్నావటరా! ఓసీ చేటుడా! వీడిని పట్టుకో! ఇంతలో నవమాలికను ప్రసన్నురాలిని చేస్తాను.

చేటి—దొరగా రాజ్ఞాపించినట్లే.

విటు—(విదూషకుని విడిచి చేటి పాదము లపైఁ బడును) నవమాలికా! శాంతించు. శాంతించు.

విదూ— (తనలో) ఇదే తొలగిపోవుటకు మంచి సమయం. (పఱుగెత్తి పోనోరును)

(చేటుఁడు విదూషకుని జందెము పట్టుకొనును. అది తెగును)

విటు—ఎక్కడికిరా! కపిలమర్కటా! పరుగెత్తుతున్నావు. (ఉత్తరీయముచే విదూషకుని మెడ బంధించి లాగును)

విదూ.—అమ్మా! నవమాలికా! అనుగ్రహించు, నన్ను విడిపించు.

చేటి.—(నవ్వి) నేలపై తలపెట్టి నాపాదాల మీద పడినట్లైతే నన్ను విడిపిస్తాను.

విదూ.—(రోషముతో-వణకుతో) అమ్మో! గంధర్వరాజు మిత్రుణ్ణీ, బ్రాహ్మణుణ్ణీ అయి ఈదాసి కూతురు పాదాలమీద పడతానా?

చేటి.—(వ్రేలితో బెదరించుచు - చిఱునవ్వుతో) ఇప్పుడే పడేటట్లా చేస్తాను. శేఖరకా! లే. నీకు ప్రసన్నురాలి నయ్యాను. (కంఠము కౌగిలించును.) అల్లుడుగారి ప్రియమిత్రుడున్నూ, బ్రాహ్మణుడున్నూ అయిన ఇతడు నీచే అవమానింపబడ్డాడు. ఇది విని ఒకప్పుడు మిత్రావసువుగారు కోపపడతారు. అందుచే ప్రీతితో ఈతని గౌరవించు.

విటు.—నవమాలిక ఆజ్ఞాపించినట్లే (విదూషకుని కంఠమున గ్రహించి) ఆర్యా! నీవు చుట్టాని వని చెప్పి కొంచెం మేలమాడాను. (తల తిరుగు

చుండగా) శేఖరకుడు మత్తబాలకు డన్నమాట నిజమేనా?

విదూ—కాదు. కాదు.

విటు—(సంతోషముతో) అయితే వేళా కోళం చాలును. (ఉత్తరీయము గుండ్రముగాచుట్టి విదూషకుని కాసనముగా నిచ్చును) చుట్టంగా రిక్కడ కూర్చోండి.

విదూ— (తనలో) అదృష్టంచే ఇతని మత్తు తొలగినట్టుంది. (కూర్చుండును)

విటు—నవమాలికా! నీవుకూడా ఈతని చెంత కూర్చో. మీ యిద్దర్నీ ఒక్కమారే గౌరవిస్తాను.

చేటి—(నవ్వి కూర్చుండును.)

విటు—ఒరే! చేటుడా! ఈగిన్నె మంచి కల్లుతో నింపు.

చేటు—(నాట్యముతో గిన్నె నింపును).

విటు—నవమాలికా! నీవు త్రాగి దీని నితని కియ్యి. (తన తలమీదిపూలమాలికనుండి పూలు తీసి గిన్నెలో వేసి మోకాళ్ళపై కూర్చుండి నవ మాలిక కిచ్చును.)

చేటి—(చిఱునవ్వుతో) శేఖరకుడు చెప్పినట్లే (అట్లుచేసి శేఖరకుని కిచ్చును.)

విటు—(విదూషకునికి గిన్నె యిచ్చును) వనమాలిక మోము తాకుడుచే రసమెక్కువ చేయబడినదీ, శేఖరకుడు తప్ప ఇతరు డెవ్వడూ ఇంతకు ముందు తాగనిదీ అయిన దీన్ని నీవు త్రాగు. ఇంతకంటె వేఱే గౌరవం నీ కేమి చేయగలను.

విదూ— (సిగ్గుతోఁ గూడినచిఱునవ్వుతో) శేఖరక! నేను బ్రాహ్మణుణ్ణికదా!

విటు—నీవు బ్రాహ్మడవైతే నీ యజ్ఞోపవీత మేదీ?

విదూ—(యజ్ఞోపవీతము తన మేన లేకుండుట చూచి) ఈ చేటునిచే నేను లాగబడుతూఉంటే తెగిపోయినది.

చేటి—(నవ్వి) అట్లైనచో కొన్ని వేదాక్షరాలైనా ఉదాహరించు.

విదూ—అమ్మా! ఈకల్లు కంపుచే నా వేదాక్షరములు కట్టివేయబడ్డాయి. లేక నీతో నాకు

వివాద మెందుకు? ఈ బ్రాహ్మడు నీ పాదాలమీద పడుతున్నాడు. (అనిపాదములమీదఁబడఁబోవును)

చేటి—(చేతులతో నివారించి) వద్దు. వద్దు. అయ్యగా రిట్లు చేయవద్దు. (శేఖరకునితో) శేఖరక! తొలగు తొలగు. నిజంగా ఈయన బ్రాహ్మడు కదా! (విదూషకుని పాదములమీదఁబడి) ఆర్యా! కోపగించకండి. చుట్టానికి తగిన పరిహాసం నేను చేశాను.

విటుడు—నేనుకూడా ఈయన్ని శాంతింప చేస్తాను. (పాదములమీదఁబడి) అయ్యగారు క్షమించాలి. క్షమించాలి. మత్తుకులోనై నేను నేరం చేసిఉంటాను. నే నింక నవమాలికతో పాన భూమికి వెడతాను.

విదూ—నేను క్షమించాను. మీరిద్దరూ వెళ్ళండి. నేనుకూడా ప్రియమిత్రుణ్ణి పోయి చూస్తాను.

(విటుఁడు, చేటుఁడు, చేటి నిష్క్రమింతురు)

విదూ—అదృష్టంచే బ్రాహ్మడికి అకాల మృత్యువు తొలగింది. ఈ బ్రాహ్మణుభోతు తాకుడుచే మైలపడ్డ నేనుకూడా దిగుడుబావిలో స్నానంచేసి ప్రియమిత్రుణ్ణి చూస్తాను. (అట్లుచేసి నేపథ్యాభిముఖముగాఁ జూచి) ఇదుగో ప్రియమిత్రుడు రూపం దాల్చిన స్వయంవరలక్ష్మిలా ఉన్నమలయవతిని చేతితో పట్టుకొని ఇటె వస్తున్నాడు. అందుచేవెళ్ళి అతడి పజ్జ నిలబడతాను.

(పిమ్మట వివాహ వేషాలంకృతుఁడైన నాయకుఁడు, మలయవతి, విభవము ననుసరించి పరివారము ప్రవేశింతురు)

నాయ—(మలయవతిని నిరూపించి)

మ త్త. చూతు, నేలకుఁ జూచు
మాటకుఁ జొత్తుఁ బల్కదు సిగ్గునం
గాతుఁ బ్రక్కకొదింగి నిల్చును,
గౌఁగిలింతు వణంకు, సం
గాతముల్ చనఁబోఁ జనన్ సమకట్టుఁ
దాను నవోఢ యీ

రీతి వామతచేతనే యలరించె
న న్నిపు డెంతయున్.*

(మలయవతిని జూచుచు) ప్రియా మలయవతీ!

చ. ఇడుచు జవాబు హుంకృతుల
నే, కడుమానముపూని, మేను పె
ల్లుడుకఁగఁ జేయుచుంజ శశధ
రోస్త్రములన్ దవవహ్ని దీప్తులన్

పాఠాంతరము.

*చం. కనుఁగొనఁ గ్రిందు చూ
చుఁ, బలుకం గమకింపదు పల్కరింపఁ బ్ర
క్కను వెనుజూపి పండుకొను,
కౌఁగిట బల్మి గదింపఁ గంపిలుఁజ
జనెడిసఖీజనంబుఁ గని
సద్మము వెల్వడి యేగ నెంచు, ని
వ్వనిత నవోఢ వామతనె
పారములేనిప్రియంబు గూర్చెడిన్.

విడున కనన్యబుద్ధి నినె
ప్రేయసి! ధ్యానముచేసి శేఁ బవ
శ్శృడరిచితిం దపమ్ము ఫల
మా భవదాస్యము సిద్ధు కాంచితిన్.

నాయి—(అపవారించి) చెలీ! చతురికా! ఇతడు కేవలం దర్శనీయుఁడేకాడు, ప్రియంపలుకుట కూడా ఎఱుంగును!

చేటి—(నవ్వి) ఓసి! ప్రతిపక్షపాతినీ! ఇది నిజమే. ఇందులో ప్రియవచన మే మున్నది?

నాయ—చతురికా! కుసుమాకరోద్యానము నకు మార్గము చూపుము

చేటి—రండు. రండు. దొరగారు!

నాయ—(పరిక్రమించుచు నాయికను నిర్దేశించి) నీవు మెల్ల మెల్లగా వత్తువుగాక! ఏలయన?

చ. చనుఁగవ వ్రేగె మధ్యమును
శ్రాంత మొనర్పఁగ నేల హారముల్,

ఘనజఘనంబె యూరువులఁ
గాడ్పుఱుప న్మఱి కాంచి యేల, కా
ర్శ్యను దోడదోయి పూనుటకె
లావు హుళక్కిగ నందె లేల, స్వాం
గసిచయ భూషితాంగ వికీ
గాసికినై నగలేల తాల్చెదో?

చేటి—ఇదే ఆ కుసుమాకరోద్యానం. దేవ
గారిందు ప్రవేశింతురుగాక!

(అందఱు ప్రవేశింతురు)

నాయ—(అంతటఁజూచి) ఈ కుసుమాకరో
ద్యానముయొక్క యనన్యశోభ నేమని చెప్పను.
ఇచ్చట.

ఉ. చల్లఁగఁజేయుఁ జందనర
సంబు లతాగృహకుట్టిమాంతముల్
జల్లు గృహాల సద్దువిని
పల్పెడి తాండవమున్ శిఖండి, యుం

త్రోల్లలితంబు వారిచయ
ముట్టెడి నింపుచుఁ జెట్లపాదులం
జెల్లుగఁ బాతవేగలఘు
వేపితపుష్పరజఃపిశంగమై.

మఱియు.

శా. గానారంభములన్ లతాగృహములం
గాఱిలం బ్రతిధ్వానముల్
పూన న్నూనపరాగపాళి నొడళుల్
బుక్కాము సంపర్కమున్
దేనెల్ తృప్తిగఁ గ్రోలుచుఁ బ్రియులతోఁ
దేంట్లివ్వి యొప్పారెడిం
బానోత్సాహమహామ్మతా మనుభవిం
పంగూడిన ట్లల్లెడన్.

విదూ.—మిత్రమా! నీకు జయ మగుఁగాక!
పూజ్యురాలా! నీకు స్వస్తి.

నాయ.— వయస్యా! చాల ఆలస్యముగా
వచ్చితివి.

విదూ — మిత్రమా! శీఘ్రంగానే బయలు దేరాను. కాని వివాహమంగళానికి కూడినసిద్ధ విద్యాధరుల పానమహోత్సవం చూచేసుకూ హాలంచే తిరుగుతూ ఇంతసే పాలస్యం చేసాను. ప్రియవయస్యుడుకూడా దీన్ని చూచుగాక!

నాయ — అట్లే. నీవు చెప్పినట్లే. (అంతటను జూచి) మిత్రమా! చూడు! చూడు.

శా. గందంబుల్ మెయిఁబూసి, తాల్చి మెడలం
గల్పస్రజాల్ చిత్రతం
బొందన్ వస్త్రము లచ్ఛముల్ మణిలస
ద్భూషాప్రభాసంగతిన్
సుందర్యాళినిపీతశిష్టమధువుల్
చొక్కంగ సేవింతు రీ
గంధర్వాల్ జతగూడి సిద్ధతతితో
గంధద్రుమచ్ఛాయలన్.

అందుచే రమ్ము. మనముకూడఁ దమాలవీథి కేగు దము.

(అందఱు పరిక్రమింతురు)

విదూ:—ఇదే తమాలవీథి. పూజ్యురాలి ముఖం శరత్సంతాపపీడితంలా కనబడుతూ ఉంది. అంచేత ఈ పటికరాతిమీదనే కూర్చోండి.

నాయ:—మిత్రమా! లెస్సగాఁబరిశీలించితివి.

క. చెక్కులుల కాంతిచేతను
జక్కలరాయని జయించి సుందరియాస్యం
బ కమలమితుఁరుచి నెఱ
పెక్క యిపుడు తన్నుఁగెల్వ సిచ్ఛించుఁజుమీ!

(మలయవతిని జేతితోఁ బట్టుకొని) ప్రియా! ఇచ్చట గూర్చుందము.

(అందఱును గూర్చుందురు)

నాయ:—(నాయిక ముఖ మెత్తి చూచుచు) చెలీ! కుసుమాకరోద్యానకుతూహలుల మైన మాచే నీ వనవసరముగా శ్రమపెట్టఁబడితివి. ఏలయన?

కం. కనుబొమ లనుతీవెల నె
ఱ్ఱసియధరకిసాలయుమ్ములఁ గాఁరెడి నీ యా

వన మియ్యది యగు నందన
వన మన్యము కేవలంపు వన మనఁగఁ దగున్.

చేటి—(చిఱునవ్వుతో విదూషకుని నిర్దేశించి) విన్నావా! అమ్మాయిగారెట్లా వర్ణింపఁబడుతున్నారో.

విదూ—చతురికా! అలాగర్వించకు. మనలో కూడా దర్శనీయులైనవ్యక్తులు లేకపోలేదు. కాని ఈసుచేత ఎవ్వరూ వర్ణింపకుండా ఉన్నారు.

చేటి— (చిఱునవ్వుతో) అయ్యగారూ! మిమ్మల్ని నేను వర్ణిస్తాను.

విదూ—(హర్షముతో) అమ్మా! బ్రతికిపోయాను. ఈ అనుగ్రహం నాకు చూపు. అప్పుడీతడు నీ వట్టివాడ విట్టివాడవు, కపిలమర్కటాకారుడవు అని మళ్ళీ అనకుండా ఉంటాడు.

చేటి— అయ్యగారూ! పెండ్లి జాగరణసమయంలో మీరు కళ్ళుమూసుకుని నిద్రిస్తూ మిక్కిలి అందంగా కనబడ్డారు. మీరావిధంగానే నిలబడండి. నేను వర్ణిస్తాను.

(విదూషకుఁ డట్లే చేయును)

చేటి—(తనలో) ఈతఁడు కళ్ళుమూసుకొని నిలబడ్డాక నీలరసంలాంటి తమాలపల్లవరసంతో ఇతనిముఖం నల్లనయేట్లా చేస్తాను.

(లేచి తమాలపల్లవములను గ్రహించుట, వానిని పిండుట నటించును. నాయికానాయకులు విదూషకునిఁ జూచుచుందురు)

నాయ—మిత్రమా! నీవు ధన్యుడవైతివి. మే మిచ్చట నుండఁగనే నీ విట్లు వర్ణింపఁబడితివి.

(చేటి తమాలరసముతో విదూషకునిముఖము నల్లగాచేసి నాయకునిముఖము చూచి మందహాసము చేయును)

నాయ—(నాయికాముఖము చూచి)

ఆ. వె. ముగ్ధనేత్ర! నీదుమోవిపల్లవమందు
స్మితసుమోదయంబు చెన్నువిూఱు
ఫలముమాత్ర మొందు పట్టఁ గానంబడుఁ
గాంచుచున్న నాదుకనులయందు.

విదూ—చేటి! నీ వేం చేశావు?

చేటి—నాచే వర్ణింపఁబడితిరిగదా!

విదూ—(చేతితో ముఖము తుడుచుకొని చేతినిజూచి రోషముతో దండకాష్ఠము నెత్తి) ఓసి దాసికూతురా? ఇది రాజకులంగదా! నిన్నిప్పుడేం చేసేది. (నాయకుని నిర్దేశించి) మిత్రమా! మీ ముందే నే నీ దాసికూతురిచే ఈవిధంగా ఖలీకరింపబడ్డాను. నే నిక్కడ ఉండి ఇంకేం ప్రయోజనం. ఇం కెక్కడికైనా వెడతాను. (నిష్క్రమించును)

చేటి—నిజంగా ఆత్రేయ అయ్యగారికి నా మీద కోపం వచ్చింది. అంచేత వెంటనే వెళ్ళి బ్రతిమాలుతాను.

నాయి—చెలీ! చతురికా! న న్నొంటరిగా విడిచి వెడుతున్నా వేమిటి?

చేటి— (నాయకు నుద్దేశించి-చిఱునవ్వుతో) ఈవిధంగా చిరకాల మొంటరిగా ఉండు

నాయ—(నాయిక ముఖముచూచి)

చ. ఖగకిరణోగ్రసంగతము
కావుటఁ బాటల కాంతి తాల్చుచున్
బరిసర దచ్ఛదంత కిర
ణంబులఁ గేసరముల్ వెలార్చు సుం
దర మగునీమెమోము ముగు
దా! నిజ మబ్జసమాన మయ్యెడిన్,
మఱి మకరంద మానుచుఁ గ
నంబడ దేటికిఁ దేటి యచ్చటన్?

(నాయిక నవ్వి మొగ మింకొకవంకకుఁ ద్రిప్పును. నాయకుఁడు మరల నదే పఠించును)

(పటాక్షేపముగాఁ బ్రవేశించి)

చేటి—మిత్రావసువు దొరగారు రేవోపనిమీద కుమారుని చూడడానికి వచ్చారు.

నాయ—ప్రియా! నీవు నీ ఇంటికి కేగుము. నేనుగూడ మిత్రావసువునుజూచి శీఘ్రముగా వచ్చెదను.

(నాయిక చేటితో నిష్క్రమించును)

(అంతట మిత్రావసువు ప్రవేశించును.)

మిత్రా—

తే. ఉగ్రశత్రుని బరిమార్పకుండ నీవు
రాజ్య మపహృత మయ్యె నరాతిచేత
ననుచు నపగతలజ్జుఁడ నౌచు నెట్లు
పలుకఁజాలుదు జీమూతవాహనునకు.

చెప్పకుండ వెళ్ళుట యుక్తము కాకపోవుటచేఁ జెప్పియే వెళ్ళెదను. (అని సమీపించును)

నాయ—(మిత్రావసువును జూచి) మిత్రావసూ! ఇటఁ గూర్చుండుము.

(మిత్రావసువు కూర్చుండును)

నాయ—(నిరూపించి) మిత్రావసూ! సంరంభము నొందినవానివలెఁ గనఁబడుచున్నావు.

మిత్రా—ఆ మతంగహతకుని విషయమున సంరంభ మనఁగా నెట్టిది?

నాయ—మతంగుఁ డేమి చేసినాఁడు?

మిత్రా— స్వనాశమునకై మీ రాజ్యము నాక్రమించినాఁడు.

నాయ—(సంతోషముతో - తనలో) ఇది సత్యమే యగునా?

మిత్రా—అతని విధ్వంసనమునకై కుమారుఁ డాజ్ఞ నొసంగవలయును. వేయేల?

మ. సకలాభ్రాధ్వగముల్ విమానములు సం
 సర్పించి నల్వంక, సూ
ర్యకరంబుల్ స్థగియించి, కారునబలెన్
 శ్యామత్వమీయం బగం
టికి. సిద్ధావళి పారి కేగు నపుడే
 నీ యాన ప్రాపించి, నీ
కిఁక సిద్ధంబ మదారినాశభయన
 మ్రేలేశ మా రాజ్యమున్.

లేదా బలసమూహములతో నేమి పని?

క. సరయాకృష్టాసి సిరం
 తరుచి సటాభారభాసి నా యొక్కనిచే

గిరి వెల్వడు హరిచేఁ గరి
కరణి నెఱుఁగుమసి మతంగఖలుఁడ ననుచున్.

నాయ — (తనలో - చెవులు మూసికొని) అయ్యో! దారుణముగా నుడువఁబడినది. నే నిట్లు పలికెదను. (ప్రకాశముగా) మిత్రావసూ! అది నీకెంత పని! బాహుబలసంపన్నుఁడ వగు నీయెడ నంత కధికముగాఁ గూడ సంభావింపఁ దగియున్నది. కాని,

గీ. ఆత్మదేహమునైనఁ బరార్థమునకు
నతికరుణ నెవ్వఁ డిచ్చు నప్రార్థితుఁ డయి
యతఁడు రాజ్యముకొఱ కెట్టు లనుమతించుఁ
బ్రాణిగణహింస యనియెడు క్రౌర్యమునకు.

మఱియు క్లేశములయెడఁ దక్క నా కింకొకయెడ శత్రుబుద్ధియే లేదు. అందుచే నీవు నాకుఁ బ్రియ మొనరింప నిచ్చింతు వేని క్లేశవశీకృతుఁడును, దీనుఁడు నగుమతంగహతకుని దయఁ జూడవలయును.

మిత్రా — (సామర్ష హాసములతో) మన కుప కార మొనరించినవాఁడును, గృతజ్ఞుఁడు నగునట్టి వానిని దయఁ జూడకుండుట యెట్లు?

నాయ—(తనలో) ప్రత్యగ్ర కోపక్షిప్త మాన సుఁడై నయినాతని నిప్పుడు నివర్తింప శక్యము గాదు. అందుచే సల్లందును (ప్రకాశముగా) మిత్రావసూ! లెమ్ము. లోనికే యేగుదము. అక్కడనే నీకు బోధించెదను. ఇప్పుడు ప్రొద్దు పడమటికి వ్రాలినది.

మ. అళి వెల్వర్చుచు సుప్తిముద్రిత ప్రబం
ధాంభోజకోశంబు, ని
చ్చలు నాశాపరిపూరణప్రవణ భా
స్వత్తోస్వ్రసంప్రీణితా
ఖిలలోకుం డయి, గ్రుంకుచు స్వనుతి వా
గ్దీప్తాస్యసిద్ధేక్షితుం
*డలరున్ భాస్కరుఁ డొక్కఁడే పరహితై
కారంభతన్ శ్లాఘ్యుఁడై.

(అందఱు నిష్క్రమింతురు)

---

పాఠాంతరం.

*అలరున్ మిత్రుఁడొకండె తాఁబరహితై
కారంభతన్ శ్లాఘ్యుఁడై.

# నా గా నం ద ము

## చ తు ర్థాం క ము

---

(అంతటఁ గంచుకియు, రక్తవస్త్రయుగళము ధరించి ప్రతీహారుఁడును బ్రవేశింతురు)

తే. గీ. నగళులందు వ్యవస్థ నొనర్చుచుండి
ప్రతిపదమునందుఁ దడఁబాటు వాపుకొనుచు
దండనీతిపరుండ వార్ధకయుతుండ
నై యనుకరింతు నృపవృత్త మఖిల మిపుడు.

ప్రతీహారుఁడు—అయ్యా! వసుభద్రయ్యగారూ! తమ రెక్కడికి బయలుదేఱినారు?

కంచు—మిత్రావసు మహారాజజననియైన దేవిగారిచే "కంచుకీ! నీవు మలయవతికిని, నల్లుడుగారికిని బదిరోజులవఱకు రక్తవస్త్రములు తీసికొని పోవలయు"నని యాజ్ఞాపింపఁబడితిని. రాజకుమారి

మలయవతి యత్తవారియింట నున్నది. జీమూతవాహనుఁడును యువరాజైన మిత్రావసువుతో సముద్రతీరము చూచుటకరిగె నని వింటిని. అందుచే రాజకుమారి చెంత కేగవలయునో, అల్లుడుగారి చెంత కరుగవలయునో తెలియకుండ నున్నది.

ప్రతీ — అయ్యో! రాజకుమారి దగ్గఱకే వెళ్ళుటయే మంచిది. అచ్చటికీ పాటి కల్లుడుగారుకూడ వచ్చియుందురు.

కంచు — సునంద! లెస్సగా నుపదేశించితివి? నీ వెక్కడికి కరుగుచున్నావు?

ప్రతీ — నేనును విశ్వావసు మహారాజుగారిచే నిట్లాజ్ఞాపింపఁబడితిని "సునంద. నీవు మిత్రావసువుతోఁ జెప్పుము. ఈ దీపప్రతిపదుత్సవమునందు మలయవతికిని నల్లుఁడుగారికిని నుత్సవమునకుఁ దగిన దేదైన నీయవలయును. అందుచే వచ్చి దానిని నిరూపింపు" మని. తమరు రాజకుమారి చెంతి కరుగుఁడు. నేనును మిత్రావసుయువరాజుగారిని దీసికొని వచ్చుటకై వెళ్లెదను.

(నిష్క్రమింతురు)

## విష్కంభకము

నాయ—(అంత జీమూత వాహనుఁడును మిత్రావసువును బ్రవేశింతురు).

చం. నిలయము చెట్లక్రింద, శయ
 నీయము శాద్వల, మాసనమ్ము ని
ర్మలశిల, శీతనిర్ఝరశ
 రంబులు పానము, లేళ్ళు తోడు, దుం
ప లశన, మిట్లయాచిత స
 మస్త విభూతిద మావనాన న
ర్థులఁ గనమిన్ బరార్థకృతి
 దూరత నుస్కి యొకండె దోషమా.

మిత్రావసు—(పైకిఁజూచి) కుమార! త్వర పడుము. త్వరపడుము. సముద్రమునకిది పోటు వేళ.

నాయ—(విని) బాగుగాఁ బరిశీలించితివి.

శా. పై కేతెంచుజలేభరాజరభసా
 స్ఫాలానుబంధోద్ధతం
బై కల్పించుచు మాటిమాటికి ద
 ర్యంతఃప్రదేశాల, న

స్తోకంబున్ శ్రుతిమార్గభేదకమునై
తోతెంచుటఁ గ్రోఁ తదే
సాకంపోజ్జ్వలనైకశంఖ ధనళం
బై వేల యేతెంచిడిఁ.

మిత్రా—అప్పుడే రానేనచ్చినదిగదా!

కం. లలిత లవంగకిసాలయ
ములఁ దిని త్రేన్చు కరి మకరముల యుద్గారం
బుల నబ్ధివేల యిది యు
జ్జ్వలమణిరుచి రంజితమ్మునలె భాసిల్లున్.

అందుచే రమ్ము! ఈ జలప్రసరణ మార్గమునుండి తొలఁగి యా పర్వతసానుసమీపమార్గమునుండి వెళ్లుదము.

నాయ—(పరిక్రమించి,చూచి) మిత్రావసూ! చూడుచూడు! శరత్కాలధవళము లైనజలదబృంద ములచే నావరింపఁబడి యీ మలయపర్వతసానువు హిమవద్గిరిశిఖరశోభ నుద్వహించు చున్నది.

మిత్రా—కుమార! ఇవి మలయాచలసాను వులు కావు. పాముల యెముకల సమూహములు గదా!

నాయ—(ఉద్వేగముతో) కష్టము. ఏ కార ణముచే నని యిట్లు సంఘాతమరణము నొందినవి.

మిత్రా—కుమార! ఇవి సంఘాతమరణము నొంది యుండలేదు. దీనిసంగతి వినుము. మున్ను తన తెక్కలగాలులచే సమస్తసముద్రసలిలముల నపాస్తములఁ గావించి తార్క్ష్యుఁడు జవమున రసాతల మునుండి పాములఁ దివిచి తివిచి యనుదిన మాహా రించుచుండెను.

నాయ—(సోద్వేగముగా) కష్టము. ఈతఁడతి దుష్కరమైనకర్మ మాచరించుచున్నాఁడు. తరు వాత. తరువాత.

మిత్రా— తరువాత సర్వోరగలోకవినాశ భీతుఁడును, నాగరాజునైనవాసుకిచే గరుత్మం తుఁడు చెప్పఁబడెను.

నాయ—(సాదరముగా) నన్ను ముందుగాఁ దిను మనియా?

మిత్రా—కాదు. కాదు.

నాయ—మఱి యేమని?

మిత్రా—ఇట్లు చెప్పఁబడినాఁడు. వైనతేయ! నీ రాకవలనిభయముచే వేలకొలఁది పాపపడఁతుల గర్భములు విచ్ఛిన్నము లగుచున్నవి. శిశువులును బంచత్వము నొందుచున్నవి. ఈవిధముగా మాకు సంతానవిచ్ఛేద మగుచున్నది. నీకును స్వార్థభంగ మావహిల్లుచున్నది. అందుచే నీ వెవరినిమిత్తమై నాగలోకముపైఁ గవియుచున్నావో యట్టి నాగు నొక్కొక్కని వార్థితీరస్థితుఁడ వైననీకుఁ బంపెదను.

నాయ—కష్టముగదా! నాగరాజుచే బన్నగములు రక్షింపఁబడిన దీ తీరుననా?

గీ. రెండువేల జిహ్వాలయం దొకండుకూడఁ
గాకపోయెనె, సర్పరక్షణముకొఱకు
నిత్తు కశ్యపసుతునకు నీ మదీయ
కాయ, మంచును వచియింపఁగల రసజ్ఞ.

అటుపిమ్మట.

మిత్రా—పక్షిరా జందు కంగీకరించెను.

చం. అటు నియమం బొనర్చి వినతాత్మజుఁ డన్వహ మొక్కఁ డొక్కఁడౌ

నటు విట నాహరింపఁ బవ
నాశననాథుల వారికీకస
చ్ఛటలు హిమానవనీధర ల
సదృచిశోభితముల్ వివృద్ధి పొ
కటముగఁ గాంచెఁ గాంచు నిఁకఁ
గాంచుచు నున్న వహఃక్రమంబునన్.

నాయి—(ఆశ్చర్యముతో)

గీ. అఖిల మాలిన్యములకును నాలవాల
మతికృతఘ్నము నశ్వరం బైనయట్టి
కుత్సితాంగనిమిత్తమెకూడ నహహా!
అఘములను మూఢమానవు లాచరింత్రు.

అకటా! నాగముల కింతులేసి యెట్టివిపత్తు సంభ
వించినది! (తనలో) నాశరీరము నొసంగుటచే నే
నొక్క సర్పముప్రాణముల నైన రక్షించుటకు
సమర్థుఁడ నగుదునా?

(అంతఁ బ్రతీహారుఁడు ప్రవేశించును)

ప్రతీ—కొండకొన కెక్కితిని. ఇంక మిత్రా
వసువును వెదకెదను. (పరిక్రమించి) మిత్రావసు

నల్లుఁడుగారి చెంత నున్నాఁడు. (సమీపించి నమ
స్కరించి) కుమారులకు జయ మగుఁగాక!

మిత్రా—నీవిచ్చటి కేమి కారణమున వచ్చితివి?

(ప్రతీహారుఁడు చెవిలోఁ జెప్పును)

మిత్రా—కుమార! తండ్రిగారు నన్ను రమ్మను చున్నారు.

నాయ—అయినచో వెళ్ళుము.

మిత్రా— కుమారుఁడుకూడ బహుప్రత్యపాయభూయిష్ఠ మైనయీ ప్రదేశమునఁ గుతూహలముచేఁ జిరకాల ముండరాదు.

(అని ప్రతీహారునితో నిష్క్రమించును)

నాయ—నేనును గిరిశిఖరమునుండి దిగి సముద్రతీరము నవలోకించెదను. (పరిక్రమించును)

(నేపథ్యమున)

హా! కుమార! శంఖచూడ! నీవు చంపఁబడుతూ వుండగా నేను చూడవలెనా?

నాయ——(విని) స్త్రీ జనార్తాలాపమువలె వినవచ్చుచున్నది. అందుచే వెళ్ళి ఆమె యెవ్వరో, ఆమె కెందుండి భయము కలిగినదో స్పష్టముగాఁ దెలిసికొందును. (పరిక్రమించును)

(తరువాత నేడ్చుచున్న వృద్ధజననిచే ననుగమ్యమానుఁడై శంఖచూడుఁడును, గోపాయితవస్త్రయుగళుఁడై నకింకరుఁడును ప్రవేశింతురు)

వృద్ధ——అయ్యో! కుమారా! శంఖచూడ! నీవు చంపఁబడుతూ వుండగా నేను చూడవలెనా? ఈమోముచంద్రుఁడు లేకున్నట్లయితే నాహృదయం పాతాళంలాగ చీకటిమయమైపోతుంది.

శంఖ——అమ్మా! ఏల యిట్లతివిక్లబత్వముచే మమ్మింతగాఁ బీడించెదవు.

వృద్ధ——(చిరకాలముచూచి కుమారుని యవయవములను స్పృశించుచు) అయ్యో! కొడుకా! సూర్యుసకిరణాలుకూడా ఎన్నడూ చూడని నీ సుకుమారదేహాన్ని నిర్దయాత్ముడై గరుడు డెట్లా భుజిస్తాడు. (కంఠము కౌగిలించి బిగ్గరగా నేడ్చును).

శంఖ—అమ్మా! ఇంక నేను చాలింపుము.

క. పుట్టినవానిని కౌఁగిటఁ
బెట్టు ననసత్యతయె దాదివిధమున మొదటన్
బెట్టు జనయిత్రి పిదపనె
యట్టి యెడం జోటుగలదె యారటమునకున్.

(సాఁగోరును)

వృద్ధ—కొడుకా! ఒక ముహూర్తకాలమైన ఆగుము. ఇంతలో నీమొగం చూస్తాను.

కింకరుఁడు— (సాక్షేపముగా) కుమార! గమ్మ్న శంఖచూడా! గమ్మ్మ మీ అమ్మమాటల కేమిలే. పుత్రస్నేహమోహితురాలైనయీమె రాజకార్యం తెలుసుకోలేకుండా ఉన్నది.

శంఖ—ఇదిగో వస్తున్నాను.

కింక— (తనలో) ఇతఁడు వధ్యశిలచెంతకు తీసుకురాబడ్డాడు. అందుచే ఈతనికి వధ్యచిహ్నమైనరక్తాంశుకయుగళ మిచ్చి వధ్యశిల చూపిస్తాను.

నాయ— (చూచి) ఆ స్త్రీ యీ మెయే. (శంఖచూడునిఁజూచి) ఈత డీమె కుమారుఁడై యుండవచ్చును. ఇతనికొఱకే యీమె యేడ్చుచుండును. (అంతటను జూచి) ఈమె కిచ్చట నే భయకారణమును గానఁబడుటలేదు. ఈమె కెక్కడినుండి భయ మావహిల్లి యుండును? సమీపించి యడుగుదునా? కాదు. సంభాషణ సాగుచునే యున్నది. ఒకవేళ దానినుండియే కారణము వ్యక్తము కాఁగలదు. అందుచేఁ జెట్టుచాటుననుండి యాలించెదను. (అట్లుచేయును.)

కింక—(కన్నీటితో దోసిలి యొగ్గి) కుమార! శంఖచూడా! ప్రభువుగారి ఆదేశమని చెప్పియే ఈలాంటి నిష్ఠురవిషయం చెప్పబడుతోంది.

శంఖ—భద్రా! చెప్పుము.

కింక— నాగలోకస్వామి యైనవాసుకి ని న్నాజ్ఞాపిస్తున్నాడు.

శంఖ—(తలపై దోసిలియొగ్గి సాదరముగా) ప్రభు వేమని యాజ్ఞాపించుచున్నాఁడు?

కింక — ఈ ఎఱ్ఱబట్టలజంట కట్టుకొని వధ్యశిల నెక్కుము. అప్పు డీ యెఱ్ఱబట్టల గుర్తుచే కనిపెట్టి గరుడుడు నిన్ను భక్షిస్తాడు అని.

నాయి — కష్టము. ఈ దీనుఁడు వాసుకిచే గరుడుని కాహారముగా నీఁబడినాఁడు.

కింక — శంఖచూడ! దీన్ని పుచ్చుకో (అని వస్త్రయుగళ మిచ్చును)

శంఖ — (సాదరముగా) ఇట్లిమ్ము (అని గ్రహించి) స్వామియాన తలదాల్చితిని.

వృద్ధ — (కుమారునిచేత వస్త్రములుచూచి రొమ్ము బాదుకొనుచు) అయ్యో! కొడుకా! ఇది పిడుగుపాటుతో సమానంగా కనబడుతున్నది. (అని మూర్ఛిల్లి పడును).

కింక — గరుడుడు వచ్చే వేళ సమీపించింది. అంచేత శీఘ్రంగా తొలగిపోతాను. (అని నిష్క్రమించును).

శంఖ — అమ్మా! ఊరడిల్లు మూరడిల్లుము.

వృద్ధ—(కొడుకు నెత్తికొనుచు) అయ్యోనాయనా! అయ్యో కొడుకా! అయ్యో! మనోరథశతలబ్ధా! అయ్యో! భర్తా! అయ్యో! వినయసముద్రుడా! పున్నమచంద్రుడిలాంటి నీముఖ మింకెక్కడచూడ జాలుతాను. (కంఠము కౌగిలించి యేడ్చును).

నాయి—అహా! గరుడుని నిర్దయత్వ మే మని చెప్పను?

చ. వనరుచు బిట్టు మూర్ఛ యయి
    బాష్పము లోడ్చుచు మాటిమాటికిన్
  దనయ! యెవండు నీకు శర
    ణంబని దిక్కు లు చూచు చార్తయౌ
  జననికనుంగట న్నిలుచు
    జాతుని నిర్దయుఁడై భుజించుతా
  ర్క్ష్యుని దగుముక్కు కా దెడఁద
    కూడను వజ్రమయం బగుంగదా!

శంఖ—(దుఃఖాతిశయముచేఁ దల్లి హృదయ భేదమును శంకించి యీమెనుగూర్చి)

చ. ఎవ తొనరింప రర్థుల య
భీష్టము వంధ్యముగా దయార్ద్రులై
యెవరు దయాపరిగ్రహాత
నెంచరు స్వార్థమునుం బరార్థమై
యెవరు పరోపతాపమున
నెప్డు తపింత్రు గతించి రట్టిసా
ధువు లిఁక నమ్మరో! యెవరి
తో మొఱవెట్టెద వాపు మత్రపుల్.

(తనచేతితోఁ దల్లి కన్నీరు తుడుచుచు) అమ్మా! నీ కీ వైక్లబ్య మెందు కని? తల్లీ! ఊఱడిల్లు మూఱడిల్లుము.

వృద్ధ —(కన్నీటితో) కొడుకా! ఎట్లా ఊఱడిల్లేది? ఒక్కఁడే కొడుకని చెప్పి దయగలవాఁడైన నాగరాజు వాసుకిచే నీ వెందుకు నివారింపబడలేదు. హా! కృతాంతహతకా! జీవలోక మంతా యీ విధంగా అడ్డులేక సాగుతూ ఉండగా జ్ఞాతిగుండె వాడ వైనవీ విప్పుడు నాకొడుకు నెందుకు మఱచి పోవైతివి? దురదృష్టవంతురాల నైననేను సర్వ విధాలా నిహతురాల నైతిని.

నాయ——(సకరుణముగా)

గీ. బాంధవాళి పరిత్యక్తుఁ బరమదీను
గళగతప్రాణు వీని రక్షణము సేయ
నోపనయ్యెదనేని ప్రయోజనమ్ము
కలుగు నెయ్యది మామకాంగంబువలన?

అందుచే సమీపించెదను.

శంఖ——అమ్మా! హృదయమును దృఢ పఱచుకొనుము.

వృద్ధ——హా! కొడుకా! శంఖచూడ! నాగ లోకాన్ని రక్షించేవాసుకే నిన్ను విడిచినప్పు డింక నిన్ను రక్షించేవా రెవరు? నే నెట్లా ఊరు డిల్లగలను.

నాయ——(త్వరగా సమీపించి) నేను. నేను.

వృద్ధ——(ససంభ్రమముగా గరుడభ్రాంతిచేఁ దనయు త్తరీయముచేఁ బుత్రునిఁ గప్పుచు నాయ కుని సమీపించి) వినతానందనా! నన్ను తిను. ఈనాడు నాగరాజుచే నీ కాహారనిమిత్తం పంప బడ్డాను.

నాయ—(కన్నీటితో) అహా! పుత్ర వాత్సల్యమే మని చెప్పను?

క. తనయానురక్తయీయమ
  కను వైక్లబ్యంబు దీనిఁ గాంచినయెడ ని
  ర్ఘృణహృదయుఁడైన వాతా
  శనశత్రువుకూడ జాలిచను నని యెంతున్.

శంఖ—అమ్మా! భయ మింకఁ జాలింపుము. ఈతఁడు నాగశత్రువు కాఁడు చూడుము.

క. పెనుపాముల తల మాంసము
  తునియఁ దొరఁగు రక్తవితతిఁ దోఁగిన తుండం
  బున నొప్పు గరుడుఁ డెచ్చట
  వినతుఁ డితఁడు సత్త్వశీల విగ్రహుఁ డెచటన్.

వృద్ధ—కొడుకా! నీచావుచే భీతురాలనైన నాకు సకలజీవలోకమూ గరుడమయంగానే కన బడుతున్నది.

నాయ—అమ్మా! భయపడకుము. నేను విద్యాధరుఁడను. నీకుమారుని రక్షించుటకే వచ్చి తిని. అందుచే నీవు ధైర్యముగా నుండుము.

వృద్ధ—(సంతోషముతో) కొడుకా! మళ్ళీ పలుకు మీా అక్షరాలు.

నాయ—పిసిసి మాటిమాటికిఁ బలుకుటచే నేమి ప్రయోజనము? కార్యముచేతనే నిరూపించెదను.

వృద్ధ—(తలపై నంజలి బంధించి) వత్సా! చిరకాలము జీవింపుము.

నాయ—

గీ. ఇమ్ము నా కిది వధ్యచిహ్నమ్ము తల్లి!
దీనిఁ దాలిచి భవదీయసూనుజీవి
తావనార్థము పక్షికులాధిపతికి
నస్మదంగంబు నొసఁగెద నాహరింప.

వృద్ధ— (చెవులు మూసికొని) అమంగళం తొలఁగిపోవుగాక! వత్సా! నీవు నాకు శంఖచూడుడితో సమానమైనకుమారుడవు. లేక చుట్టాలచే విడువబడ్డ నాకుమారుణ్ణి నీ శరీరదానంచేత రక్షింపబూనడంచేత శంఖచూడుడికంటేకూడ ఎక్కువైనవాడవే.

శంఖ—(విషాదముతో) ఆహా! ఈ మహాసత్త్వుని భావము లోకవిపరీతముగా నున్నది. ఏలయన?

మ. తినియెం గుక్క-హాలన్ శ్వపాకునటు గా
ధేయుండు ము న్దేనఁ; జెం
డెను దేనం బరమోపకారి యగు నా
డీజంఘునిం గౌతముం,
డనయం బీ ఖగరాజు సర్పముల నా
హారించు నెద్దాన, నీ
ఘనుఁ డా ప్రాణము జాలిమైఁ దృణ మనం
గా వీడు నన్యార్థమై.

(నాయకునుద్దేశించి) ఓమహానుభావా! నీచే నాత్మప్రాణదానవ్యవసాయనిర్వ్యాజ మైనదయాళుత్వము నాయెడఁ జూపఁబడినది. అందుచే నీ నిర్బంధ మింకఁ జాలును. చూడుము.

కం. మాదృశులు క్షుద్రజీవులు
మేదిని జనియింత్రు చంత్రు మృత్యువివశులై
త్వాదృశుల కబ్బు నెచ్చటఁ
బ్రాదుర్భావము పరార్థబద్ధకటులకున్.

అందుచే నీ నిర్బంధ మెందులకు? అనుగ్రహించి యీ ప్రయత్నము విడువుము.

నాయ.—(శంఖ చూడునిఁ గరమున గ్రహించి) కుమార! శంఖచూడ! చిరకాలమునకు లభించిన నా యీ పరార్థసంపాదన మనోరథమునకు విఘ్నముకలిగింప నర్హుఁడవు కావు.

శంఖ.—ఓ మహాత్మా! సాహసికాగ్రణీ! ఏఁ వ్యర్థముగాఁ బ్రయాసపడెదవు. ఈ శంఖచూడుఁడు శంఖధవళ మైనశంఖపాలకులమును మలిన మొన రింపఁడు. మాయెడ దయఁజూప నెంచుచో నా కబ్బినయీ విపత్తుచేఁ గలఁత నొందినమాయమ్మ జీవితము విడువకుండునుపాయ మాలోచింపుము.

నాయ.— ఇప్పు డాలోచింపవలసిన దే మున్నది? ఉపాయ మిదివఱకే చింతింపఁబడినది. అదియును నీ యధీనమై యున్నది.

శంఖ.—అది యెట్టిది?

నాయ.—

గీ. నీవు మరణింప నెవ్వఁతె చావఁ గోరు
నీవు జీవింప నెవ్వఁతె జీవ మొందు

నామె బ్రదుకుట నీకోరికై నయెడల
నాత్మ రక్షించుకొమ్ము నా ప్రాణములను.

ఇదేయుపాయము. వధ్యచిహ్నమర్పింపుము. దానిచే నన్నుఁగప్పుకొని వధ్యశిలనారోహించెదను. నీవును మీ యమ్మను ముందుంచుకొని యీ ప్రదేశము నుండి మరిగిపొమ్ము. ఒకవేళ సమీపముననున్న యీ యాఘాతస్థానమును జూచి యీమె స్త్రీ స్వభావకాతరత్వముచేఁ బ్రాణములు విడువ వచ్చును. చచ్చినపాముల యెముకలగూళ్ళచే సంకులమైనయీ శ్మశానమును నీవుచూచుటలేదా!

మ. చలతుండాగ్ర విభిన్నసప్పతిత మాం
స గ్రాస గర్ధంబు గృ
ద్ధల సంఘంబు నిబద్ధపక్షయుగళో
త్కంపంబులం గూర్చు న
గ్గలమగా చీఁకటి స్వేచ్ఛమైఁ దిరుగుచుం
గ్రందించు నుత్పాదిత
జ్వాలనజ్వాలములై శివావితతు ల
స్స్రోతముం దెప్పుడుం

గలయంబాఱు వసావితానమున దు
ర్గంధాక్తమై నయ్యెడన్.

శంఖ—చూచుచుండ కేమి?

గీ. అనయ మహిహారమునను శూన్యంబుగాక
చేయు చెంతయుఁ బ్రీతి వినాయకునకు
వనరుహారిసి తాస్థికపాల మగుచు
నీ శ్మశానము పోలు నుమేశు మేను.

అందుచే నరుగుదము. ఇంక నీ సామోపన్యాసములచే నేమి ప్రయోజనము. గరుడుఁడు వచ్చువేళ యైనది. (తల్లి ముందు మోకాళ్లపైఁగూర్చుండి తలపై దోసిలి యొగ్గి) అమ్మా! నీవుకూడ నిప్పుడు తిరిగిపొమ్ము.

కం. జననీమతల్లి! యే యే
జనులందెట్లు మనము జనయించెదమో
తనయానురక్త! యా యా
జనులను మాకగుదుగాక జననివి నీవే.

(పాదములపైఁ బడును.)

వృద్ధ—(కన్నీళ్లతో) ఏమి! ఇవే నీడి కడసారి పలుకులా? కొడుకా! నిన్ను విడిచి నాకాళ్లెంకో

చోటికి పోవడంలేదు. అంచేత నేనుకూడా నీతో పాటు మరణిస్తాను.

శంఖ—(లేచి) నే నిచ్చటి కు త్తరమున దగ్గఱగా నున్న దక్షిణగోకర్ణేశ్వరునికిఁ బ్రదక్షిణ మాచరించి ప్రభుపయోగము నిర్వర్తించెదను. (తల్లితో నిష్క్రమించును)

నాయ—నాకోరిక యీడేరినది. ఇంక సాధించుటకుపాయ మేమి?

(అంత వస్త్రములతోఁ గంచుకి ప్రవేశించును)

కం—ఇదిగో! రక్తాంశుకయుగళము. మిత్రావసు జననియైనదేవిగారిచేఁ గుమారునికిఁ బంపఁబడినది. అందుచేఁ గుమారుఁడు దీనిని ధరించుఁగాక!

నాయ—(చూచి—సంతోషముతో, తనలో) అదృష్టవశమునఁ దలవనితలంపుగా లభించిన యీ రక్తాంశుకయుగళముచే నా కోరిక సిద్ధించినది. (పైకి) కంచుకీ! ఇటు తెమ్ము.

(కంచుకి రక్తాంశుకయుగళ మొసంగును)

నాయ—(గ్రహించి, ధరించి తనలో) మలయవతీ! ఓడి నా వివాహ మిప్పుడు సఫల మైనది. (పైకి) కంచుకీ! వెళ్ళుము. నా వచనముచే దేవి కభివందన మొనరింపుము.

కంచు—కుమారుఁ డాజ్ఞాపించినట్లే. (అని నిష్క్రమించును)

నాయ—

గీ. ప్రాప్తకాలంబునకుఁ బొందఁబడినదియును
రక్తవర్ణంబు నయినవస్త్రయుగ మిద్ది
అధికతర మైనయానంద మావహించుఁ
బరహితార్థైకదృష్టినై పరఁగు నాకు.

(దిక్కులుచూచి) ఇప్పుడు ప్రచండ మైనయీ గాలి మలయాచలము నందలి శిలాసమూహములఁ గంపింపఁజేయుచుండుటచే · నా పక్షిరాజు సమీపస్థుఁ డైనాఁ డని తలంతురు.

మ. ప్రళయాంభోధరతుల్యపక్షతికదం
బంబభ్రమముంగప్పు; నీ

ర్జలధిప్రాంతము చేర్చు వేగపవముల్
త్తౌన్నప్లావనార్థంబునా;
విలయభ్రాంతి నొనర్చుచుఁ దిగిభముల్
వీక్షింప భీతిఁ హరి
త్తులు పింగంబు లొనర్చు ద్వాదశరవి
ద్ధుం డీత డంగార్చులఁ.

అందుచే నీ శంఖచూడుఁడు వచ్చునంతలో శీఘ్రముగా నీ వధ్యశిల నారోహించెదను. (అట్లు చేసి కూర్చుండి శిలాస్పర్శ నటించుచు) ఆహా! దీని తాకుడు నేమని వర్ణింతును?

గీ. ఇష్టకార్యసిద్ధి నెనయుటకై సమా
శ్లిష్ట మిచటి వధ్యశిలయుఁబోలె
మలయజార్ద్రియైన మలయవతియుఁగూడ
హాయి నొసఁగఁజాలఁ దనుచుఁ దలఁతు.

మలయవతియే యన నేల?

గీ. శైశవంబున జనని యుత్సంగమందు
గడుముదంబునఁ బన్నుండి పడయనైతి
నే సుఖం బది నే నిప్పు డెనయుచుంటి
నిలిచి యీ వధ్యపాషాణతలమునందు.

అదుగో! గరుడుఁడరుదెంచినాఁడు. ఇంక నన్నుఁ గప్పుకొని పలఁబడెదను. అట్లుచేయును.

(అంతట గరుడుఁడు ప్రవేశించును.)

గరుడుఁడు—

చం. కని శశిబింబమున్ సభయ
కల్పితమండల మైనశేషమూ
ర్తిని స్మరియించి, స్యందన హ
రిత్రసనాన నినిందు కంపిలం
గను, గన నన్నమోద మెసఁ
గన్, గొనఁ జట్టుప లాయతత్వముం
గొనలఁ జలించునంబుధర
కూటముచేఁ ద్రుటిలోనఁ దీరచం
దనగిరి చేరవచ్చితి ఫ
ణాధరభక్షణతత్పరుండనై.

నాయ—(సంతోషముతో)

గీ. అస్మదంగంబు నిచ్చి వాతాశనంబు
నిపుడు రక్షించి యార్జింతు నే సుకృతము
నదియు నాకుఁ బరోపకారార్థమైన
వర్ష్మలాభంబు నిడుఁగాక ప్రతిభవంబు.

గరు—(నాయకుని జూచి)

చం. పరభుజగావనార్థమయి
వధ్యశిలాతలమందు నిల్చి, మ
ద్గురుభయదీర్యమాణ మెద
దూసిన నెత్తుట దిగ్ధమయ్యె నా
నరుణపటంబుఁ దాల్చి నహి
నానఁగ వక్షము చీల్చి వజ్రభీ
కర మగునాదుచంచువునఁ
గ్రక్కున నిష్ఠ సముద్ధరించెదన్.

(అని మీఁదఁబడి నాయకుని గ్రహించును)

(నేపథ్యమున దుందుభిధ్వనియుఁ బుష్పవృష్టియు)

గరు—(ఆశ్చర్యముతో) అహో! దుందుభిధ్వనియుఁ బుష్పవృష్టియు. (పైకిఁజూచి విని)

గీ. నభమునం దుండి పరిమళనందితాళి
యేలకురియుచు నున్న దీ పూలవాన
స్వర్గమునయందు దుందుభిస్వన మి దేల
మారు మలగంగఁ జేయు దిఙ్మండలంబు.

ఔను దెలిసిన దస్యుజ్జవాసిలమునఁ
బారిజాతకుజంబు కంపంబునొందెఁ
బ్రాప్తసంహారశంక సంవర్తకాభ్ర
చయ మిటులు మంద్రభంగి గర్జనము చేసె.

నాయ.—(తనలో) అదృష్టవశమునఁ గృతా
ర్థుఁడ నైతిని.

గరు.—(నాయకునిఁ గబళించుచు)

క. వాతాశనకులరక్షకుఁ
డీతఁడు గురు వౌచు దోఁచుహేతువుచేతన్
వే తొలఁగించెడి సఁకె నా
కాతతసర్పాశనేచ్ఛ యని వ్యక్తమగున్.

అందుచే నితని గ్రహించి మలయపర్వతము నెక్కి
యథేష్టముగా భుజించెదను.

(అనిజీమూతవాహనుని గ్రహించి నిష్క్రమించును)

# నాగానందము

## పంచమాంకము

---

(అంతటఁ బ్రతీహారుఁడు ప్రవేశించును)

సీ. హితుఁడు నిజమందిరోద్యానగతుఁడై యున
స్నేహమునఁ బాపమునె శంకచేయుదు రన
నతఁడు దృష్టబహూపదభ్రివాతిభయద
విపినమధ్యస్థుఁడైనఁ జెప్పెడి దిఁకేమి?

అది నిజమే. జీమూతవాహనుఁడు జలనిధివేలా దర్శనకుతూహలియై యరిగి తడసె నని మహారాజ విశ్వావసువు దుఃఖితుఁడై యున్నాఁడు. ఆయనచే నిట్లాజ్ఞాపింపఁబడితిని. "సునంద! అల్లుఁడు జీమూత వాహనుఁడు సన్నిహిత గరుడప్రతిభయ మైనప్రదేశమున కరిగె నని విని యావృత్తాంతముచేఁ జాల శంకితుఁడ నైతిని. అందుచే నాతఁ డింటికివచ్చెనో లేదో త్వరితముగా నెఱింగి రమ్ము" అని. కావున నిప్పు

డచ్చటి కరిగెదను. (పరిక్రమించుచు ముందుచూచి) ఇదుగో జీమూతవాహనుని తండ్రియు, రాజర్షియు నైనజీమూతకేతుఁడు సహధర్మచారిణిచేతను, గోడలైనరాజపుత్రికచేతను నుపాస్యమానుఁడై కూర్చున్నాఁడు.

తరువోజ__

క్షౌమయుగ్మము ఫేనసదృశము భంగ
సంకలిత మ్మూర్మిచలము ధరించి;
యామరాపగతోడ నన దేవితోడ
నతిపుణ్యతో సుపయస్కతోఁగూడి;
జీమూతకేతుండు చెలఁగు వారాశి
సిరి కీడువచ్చునుశ్రీఁ దాల్చి; యతని
సామీప్యమున నున్న సతి మలయవతి
సాగరవేల నాఁ జాలనొప్పారు.

ఇంక సమీపించెదను

(అంతట నాసనస్థుఁడు, పత్నీవధూసమేతుఁడు
నైనజీమూతకేతుఁడు ప్రవేశించును)

జీమూ__

ఉ. పొందితి యౌవనంపుసుఖ
  ముల్, యశ మెల్లెడఁ బర్వె, రాజ్యముం
బొందుగ నేలినాఁడ; దప
  మున్ స్థిరచిత్తత నాచరించితిన్
నందనుఁ డుత్తముం, డనుగు
  ణపత్నిధితాన్వయజాత కోడ లి
ట్లుందుఁ గృతార్థతం గనుట
  యిప్పుడు మృత్యు వొకండె చింత్యమా!

ప్రతీ__(తొందరగా సమీపించి) జీమూతవాహనునికి-

జీమూ__(చెవులు మూసికొని) పాపము శమించుఁగాక. పాపము శమించుఁగాక!

వృద్ధ__అమంగళం అప్రతిహత మగుగాక.

నాయి__(తనలో) ఈ దుశ్శకునంచేత నా గుండె అదురుతోంది.

జీమూ__భద్రుఁడా! జీమూతవాహనున కేమి?

ప్రతీ___ జీమూతవాహనునివార్త నన్వేషించుటకై మహారాజ విశ్వావసువుచే మీ చెంతకుం బంపఁబడితిని.

జీమూ___ఏమి? అచ్చట మాపుత్రుఁడు లేడా!

ప్రతీ___లేఁడు.

వృద్ధ___(విషాదముతో) అక్కడ లేనట్లైతే నా కొడు కిం కెక్కడికి వెళ్ళిఉంటాడు?

జీమూ___మన ప్రాణయాత్రకై చాలదూర మరిగి యుండవచ్చును.

నాయిక___(విచారముతో - తనలో) ఆర్య పుత్రుడు కనబడకపోవడంచేత నా కిం కేదో అనుమానం కలుగుతోంది.

ప్రతీ___నేను ప్రభువుగారి కేమి చెప్పవలయునో రా జానతిచ్చుఁగాక!

జీమూ___(ఎడమకన్నదరుట సూచించి) జీమూతవాహనుఁడు తడసినందునఁ బహ్యాకుల హృదయుఁడ నైతిని.

గీ. ఏటి కదరెదు వామాక్షి! మాటిమాటి
కిట్లు నాకు ననిష్టమ్ము నెఱుఁగఁ జేయ?
హతవిలోచనమా! అపహతము నీదు
నదరు టస్మత్సుతుండు సౌఖ్యమున నుండు.

(పైకిఁ జూచి) త్రిభువనైకవిలోచనుఁడు, భగవంతుఁడు నైనయీ సహస్రకరుఁడే జీమూతవాహనునకుఁ దప్పక శ్రేయ మాపాదించును. (చూచి సవిస్మయముగా)

మ. కనుగొన్నంతనె లోచనంబులకు దుః
ఖం బెంతయో కూర్చుచుఁ
దనభానుప్రభలంబలె న్రుధిరసం
తానంబు వెల్వార్చుచుఁ
ఘనదుర్వాతవికంప్యమాన మగున
క్షత్రమ్ముభంగిఁ రయం
బున నాకాశతలంబునుండి పడు నా
ము౦ దిద్దియేదో కదా!

(అందఱును నాశ్చర్యముతో నిరూపింతురు)

జీమూ.— ఏమి! ఇది ఆర్ద్రమాంసముతోఁ గూడినచూడామణి. ఇది యెవ్వరిదై యుండును?

వృద్ధ— (విచారముతో) ఈ చూడామణి మన కొమారుడిదే.

నాయి—(అపవారించి) ఇట్లా పల్కవద్దు.

ప్రతీ—మహారాజ! పూర్తిగా నెఱుఁగకుండ యిట్లు దుఃఖితులు కానలదు. ఇచ్చట గరుడునిచే భక్షింపఁబడుచున్న నాగాధిపుల చూడామణులు తన్నఖముఖోత్ఖాతములై తఱుచుగాఁ బడుచుండును.

జీమూ—దేవి! సునందుఁడు పల్కినది యుక్తముగా నున్నది. ఒకప్పు డీ విధముగాఁగూడఁ గావచ్చును.

వృద్ధ—సునంద! ఈపాటి కొకవేళ మా అబ్బాయి అత్తవారింటికే వచ్చి ఉంటాడు. కావున వెళ్ళి త్వరితంగా తెలుసుకొని రా.

ప్రతీ—దేవిగా రాజ్ఞాపించినట్లే. (అని నిష్క్రమించెను)

జీమూ—దేవి! ఇది నాగచూడామణి యై యుండునా?

(అంతట రక్తవస్త్రాచ్ఛాదితుఁ డై నశంఖ
చూడుఁడు ప్రవేశించును)

శంఖ—కష్టము. అతికష్టము. సర్వవిధముల
దైవములచే వంచితుఁడ నైతిని.

మ. ఘనవేగంబున నబ్ధితీరగతగో
కర్ణేశ్వరస్వామికిన్
వినతుల్ చేసి భుజంగవధ్యధరణి
న్నేఁ జేరఁగా వచ్చితిన్
వినతానందనుఁ డింతలో నెగసె నా
విద్యాధరేంద్రున్నఖా
గ్రనికృత్తక్షతవక్షుఁ గైకొనుచు నా
కాశాధ్వమం దక్కటా!

(ఏడ్చుచు) హా మహాసత్త్వ! హా పరమకారుణిక! హా
నిష్కారణ బాంధవ! హా పరదుఃఖ దుఃఖిత!
హా విపద్వార్ధిపతితజనోద్ధరణ తరణీ! హా పరోప
కారతృణీకృతదత్తదేహా! ఎక్కడి కేగితివి? నాకుఁ
బ్రత్యుత్తర మిమ్మా. (తన్నుద్దేశించి) మందభాగ్యుఁ
డను. హతుఁడ నైతిని. ఓ శంఖచూడహంతకుఁడా
నీవు చేసిన దేమి?

ఉ. నాగుల రక్ష సేసి యొక
నాఁడును గీర్తి గడింప నైతి, నా
భోగివరేణ్యునాజ్ఞ నతి
పూజ్యముఁ బాలన చేయ నైతి, మై
త్ర్యాగము చేసి కాచె నొకఁ
డన్యుఁడు నన్నతిశోచ్యు నిస్సిగో!
యీగతి వానిచేత నివు
డెంతయు వంచితుఁ డైతి నక్కటా!

ఇట్టి నే నింక క్షణకాలమైన జీవించి నన్నుఁ బరిహాసపాత్రు నొనరించుకొనను. అందుచే నీరక్తధార ననుసరించి పోవుటకు యత్నించెదను.
(నేలపై దృష్టి నిగిడించుచుఁ బరిక్రమించి)

సీ. తొలుత నుత్పీడమ్మువలనఁ బెద్దయు, వెన్క
విరళపాతస్థూల బిందుకమ్ము
పాషాణములయందుఁ బడి విశీర్ణ మ్మగుచుఁ
దనుకణాకారమ్ము దాల్చినదియు
సమతలంబులఁ గీటసంకీర్ణమును ధాతు
పీఠంబునం దనవేక్ష్యమాణ

మటవీమహోర్వీరుహాగ్రభాగములందు
స్త్యానసీలాకార మందినదియు
నైకనంబడుచున్న యీ యస్రధార
ననుసరించుచు నధికనైపుణముతోడఁ
బక్షికులసార్వభౌముఁడౌ వైనతేయు
నరయ వాంఛించు చున్నయే నరుగువాఁడ.

వృద్ధ—(భయముతో) మహారాజా! ఈత డెవరో ఏడుపుమొగంతో ఇటే వేగంగా వస్తూ నాగుండె కలగుండు పడుస్తున్నాడు. అందుచే ఈత డెవరో తెలుసుకోండి.

జీమూ—దేవి చెప్పినట్లే!

శంఖ—హా! త్రిజగదేకచూడాచుణీ! హా! పరార్థదత్తదేహా! నేను ని న్నెక్కడఁ గాంతును? వంచితుఁడ నైతిని. వంచితుఁడ నైతిని. (బిగ్గరగా నేడ్చును)

జీమూ—(విని సంతోషముతో) దేవీ! విచారము విడువుము. ఈచూడామణి తప్పక యితనిదే.

మాంసలోభముచే నేదే నొకపక్షితలనుండి పెఱికి తీసికొనిపోవుచుండఁగా నిచ్చటఁ బడియుండును.

వృద్ధ—(సంతోషముతో మలయవతినిగౌఁగిలించుకొని) సౌభాగ్యవతీ! ధీరురాలవు కమ్ము. ఇటువంటి ఆకృతి యెప్పుడూ వైధవ్యదుఃఖా న్ననుభవించదు.

నాయి—(సంతోషముతో) తల్లీ! మీ ఆశీర్వాదప్రభావంచేత. (అని పాదములపైఁబడును)

జీమూ—(శంఖచూడుని సమీపించి) వత్స! నీచూడామణి యపహరింపఁబడినదా యేమి?

శంఖ—ఆర్యా! నాయొక్కనిదే కాదు, ముల్లోకములదియును.

జీమూ—ఎట్లు?

శంఖ—దుఃఖాతిభారముచే బాష్పోపరుద్ధకంఠుఁడనై చెప్పఁజాల కున్నాను.

జీమూ—

గీ. అనుఁగుఁబుత్త్రిక! దుస్సహం బైననీదు
వంత యిప్పుడు నాకుఁ జెప్పంగదయ్య

చాన నాయందు సంక్రాంత మైనదగుచు
నీకు నయ్యది సహ్యమై నిలువఁగలదు.

శంఖ—వినుఁడు నేను శంఖచూడుఁ డను పేరుగల నాగు డను. వంతువరుసను వాసుకిచే గరుడుని కాహారముగాఁ బంపఁబడితిని. విస్తరించి చెప్పుటవలనఁ బ్రయోజన మేమి? ఒకవేళ ఈ రుధిరధారాపద్ధతి ధూళిచే నాచ్ఛాదితమై దుర్లక్ష్యము కావచ్చును. అందుచే సంక్షేపముగాఁ జెప్పెదను.

క. కరుణాపూరితహృదయాం
తరుఁ డొకవిద్యాధరుండు తనదేహంబున్
గరుడునకుం బతగాధీ
శ్వరునకు నర్పించి నాదుప్రాణము నిల్పెన్.

జీమూ—జీమూతవాహనునికంటె నన్యుఁ డెవ్వఁ డిట్లు పరార్థవ్యసని కాఁజాలును? వత్సా! స్ఫుటముగాఁ జెప్ప రాదా నీపుత్త్రుఁ డైనజీమూతవాహనుఁడే యని. అయ్యో! దురదృష్టవంతుఁడను, హతుఁడ నైతిని.

వృద్ధ—అయ్యో! పుత్రకా! నీవేనా యిట్లా చరించినది?

నాయి—అయ్యో! నాకుఁగలిగినదుశ్శకునము సత్య మైనది.

(అందఱును మోహము నొందుదురు).

శంఖ—(కన్నీళ్ళతో) అహో! వీ రా మహాస త్త్వుని తల్లిదండ్రు లై యుందురు. అప్రియవాదినైన నాచే నిట్టి యవస్థపొందింపఁబడినారు. ఔను. విష ధరవదనమునుండి విషముతప్ప మఱి యేది వెల్వ డును? అక్కటా! ప్రాణప్రదుఁ డైనజీమూతవాహ నునికి శంఖచూడునిచేఁ దగినప్రత్యుపకారము చేయఁబడినది? ఇప్పుడే నాప్రాణములను వీడు దునా? కాదు. వీరి నిరువురిని సమాశ్వాసింతును. తండ్రీ! ఊఱడిల్లుము. తల్లీ! ఊఱడిల్లుము.

(ఇరువురు నూఱడిల్లుదురు)

వృద్ధ—(మలయవతి నుద్దేశించి) అమ్మాయీ తే. ఏడ్వకు. మేముమాత్రం జీమూతవాహనుడు లేకుండా జీవింతుమా? కావున కొంచె మూఱడిల్లు.

వాయి.—(ఊరడిల్లి) ఆర్యపుత్ర! నే నింక నిన్నెక్కడ చూస్తాను?

జీమూ.—హా! వత్సా!

గీ. విదితగురుజనశుశ్రూష! ప్రియతనూజ!
మామకీనపదంబుల మౌళిమణిని
విడిచి లోకాంతరమునకు వెడలికూడ
వినయ పరిపాటి నొక్కింత విడువ వైతి.

(చూడామణిని గ్రహించి) హా! వత్స! ఇంతమాత్రమే చూడఁదగినవాఁడ వైతివేమి? (హృదయమునను౦చి) హా! హా!

చ. అనవరతమ్ము భక్తి ధర
యం దతిదూరముగాఁగ నొఁదలన్
వినమితముం బొనర్చి కడు
వేడుక నా చరణద్వయానకుం
బ్రణతులు సేయు నీదు తల
మాసిక మియ్యది కోమలంబె యై
నను నెద గాటమౌ సికష
ణంబులఁ గోసెడి నెందుచేతనో.

వృద్ధ—అయ్యో! కొడుకా! జీమూతవాహన! ఏనీకు గురుజనశుశ్రూష తక్క ఇతరసుఖం రుచింపదో? అట్టి నీ విప్పుడెట్లా తండ్రిగారిని విడిచి స్వర్గ సౌఖ్యం అనుభవించడానికి వెళ్ళినావు?

జీమూ—(కన్నీళ్ళతో) దేవీ! ఎందుకిట్లు పల్కెదవు? మనముమాత్రము జీమూతవాహనుఁడు లేకుండ జీవింతుమా?

నాయి—(పాదాలపైఁబడి - నోసిలి యొగ్గి) తాతా! ఆర్యపుత్రుని అంగాభరణ మైనఈచూడా రత్నం నాకిమ్ము. దాన్ని గుండెమీద పెట్టుకుని అగ్నిలో ప్రవేశించి నాసంతాపదుఃఖాన్ని పోగొట్టుకుంటాను.

జీమూ—పతివ్రతా! ఎందుకుఁ గలఁత నొందెదవు? మా కందఱికిని నదే నిశ్చయము.

వృద్ధ—ఇంక దేనికోసం వేచిఉండడం.

జీమూ—దేవీ! దేనికొఱకును గాదు. ఆహితాగ్నియైనవాని కన్య మైనయగ్నిచే సంస్కారము విహితము కాదు. అందుచే నగ్నిగృహము

నుండి యగ్నిహోత్రమును దెచ్చి దానిచే నన్ను సంస్కరించుకొందును.

శంఖ—(తనలో) కష్టము! పాపుఁడ నైననా యొక్కని నిమిత్తమై యీ విద్యాధరకుల మంతయు నుత్సన్నమగుచున్నది. ఇట్లగుఁగాక (ప్రకాశముగా) తాత! నిశ్చయము తెలియకుండ నిట్టి సాహసమను ష్ఠించుట యుక్తముకాదు. విధివిలసితములు విచిత్రములుగా నుండును. ఒకవేళ ఈతఁడు నాగుఁడు కాదని యెఱింగి వైనతేయుఁడు బ్రతికియుండఁగనే జీమూతవాహనుని విడిచివేయవచ్చును. అందుచే నీర క్తధారచేతనే గరుడు ననుసరింతము.

వృద్ధ—సర్వవిధాలా దేవతల అనుగ్రహంచేత బ్రతికుండగానే కొమారుణ్ణి చూస్తాను.

నాయి—(తనలో) దురదృష్టవంతురాలనైన నాకిది దుర్లభం కదా!

జీమూత—వత్స! నీ యీ వాక్కు యథార్థ మగుఁగాక! అట్లైనను అగ్నిహోత్రములతోడనే యనుసరించివచ్చుట మాకు యుక్తముగానుండును.

అందుచే సంతతమైన యాధారము నీ వనుసరిం పుము. మేమును అగ్నిగృహామునుండి యగ్నుల గ్రహించి వేగముగా వచ్చెదము. (అని పత్నీ వధూసమేతుఁడై నిష్క్రమించును).

శంఖ—ఇంక నే గరుడు ననుసరించెదను. (పరిక్రమించి ముందు చూచి)

మ త్త. గిరిశిలల్ రుధిరార్ద్రచంచు వి
కృష్టి దొన్నెలఁ జేయుచున్
దరివనంబుల స్వాక్షి వహ్నిక
నచ్ఛిఖావళి నేర్చుచున్
ధరణిస క్తకఠోరవజ్ర విధా
నఖంబుల నాడుచున్
గరుడుఁ డల్లదె చందనాద్రికొనం
గనంబడు దవ్వులన్

(అంతట నాయకుఁడు ముందుపడి యుండఁగా నాస నస్థుడై గరుడుఁడు ప్రవేశించును.)

గరుడుఁడు—(తనలో) పుట్టుదొట్టి భుజంగ పతుల భక్షించు చున్నానాచే నిట్టి యాశ్చర్య

మెన్నఁడును జూడఁబడియుండలేదు. ఏలయన నీ మహాసత్త్వుఁడు కేవలము వ్యథనొందకపోవుటయే కాక ప్రహర్షము నొందినవానివలెఁ గానఁబడు చున్నాఁడు. ఔ నట్లే.

ఉ. గ్లానివహింపఁ డెంత రుధి
రంబును బీల్చిన ధీరతన్ బ్రస
న్నాననుఁ డౌను బ్రీతిఁ బల
లాహరణోత్థరుజన్ వహించియున్
గానఁగ నౌన లుప్తమగు
గాత్రములం బులకల్ స్ఫుటంబులై
యే నపకారినైనఁ గను
నీతఁడు న న్నుపకారిసం బలెన్.

ఈతని యీ ధైర్యవృత్తిచే నా కాత్ర మతిశయించి నది. ఇట్లగుఁగాక! ఈతని నే నింక భక్షింపను. ఈతఁ డెవ్వరో యడిగెదను. (అని తినుటమాని యెదుట నిల్చును.)

నాయ—

గీ. రక్తము స్రవించుచుండె సిరాముఖములఁ
గల దిపుడుకూడ మాంస మంగమ్మునందు

నగపడదు తృప్తి నీకు మహానుభావ!
గరుడ! మానితి వేల భక్షణము సేయ.

గరుడు—(తనలో) ఆశ్చర్య మాశ్చర్యము! ఏమి యీతఁ డీ యవస్థయందును నూర్జితముగానే పలుకుచున్నాఁడు. (పైకి) ఆహా మహాసత్త్వ!

గీ. నీదు హృదయంబునుండి శోణితముమాత్ర
మేను జంచువుతో నాహరించియుంటి
నిట్టి ధైర్యమ్ము పెంపుచే నీవొ నాదు
హృదయమంతయుఁగూడ హరించినావు.

అందుచే నీ వెవ్వరవో వినఁగోరుచున్నాను.

నాయ— ఈవిధముగా క్షుధాతురుఁడవైన నీవు శ్రవణయోగ్యుఁడవు కావు. అందుచే నా మాంసరక్తములచేఁ దృప్తిని బొందుము.

శంఖ— (తొందరగా సమీపించి) తార్క్ష్యా! తార్క్ష్య! సాహసమనుష్ఠింపఁదగినది కాదు. ఈతఁడు నాగుఁడు కాఁడు. ఈతని వీడి నన్ను భక్షింపుము. నీ కాహారార్థమై వాసుకిచేఁ బంపఁబడినవాఁడను నేను. (అని బొమ్ము నర్పించుచు)

నాయ — (శంఖచూడినిఁ జూచుచుఁ దనలో) శంఖచూడుఁడు వచ్చుటచే నామనోరథము సఫలీకృత మగునా యేమి?

గరుడు — (ఇరువురినిఁ జూచి) మీ యుభయులకును వధ్యచిహ్నము గలదు. ఎవరు నాగుఁడో తెలిసికొన లేకున్నాను.

శంఖ — ఇట్టిభ్రాంతి కిక్కడ నవకాశము లేదు గదా!

చం. ఉరమున స్వస్తికాంక మది
యుండఁగ నీమెయి నేదికంచుకం
బరయవె మాటలాడునపు
డైనను మద్రసనాద్వయంబు పె
న్గరళపుధూమవహ్నితతిఁ
గందఁగ రత్నరుచుల్ విచారవృ
త్కరణసమీరణాతివిత
తంబును జూడవె యీ ఫణాత్రయిన్.

గరు — (శంఖచూడుని పడగలు చూచి నాయకు నారయుచు) నాచేఁ జంపబడిన యీతఁ డెవ్వరో కదా!

శంఖ__ విద్యాధరవంశతిలకుఁ డైనజీమూత వాహనుఁడు. అకారుణికుఁడ వైననీచే నిది హత్య చేయఁబడినది.

గరు__(తనలో) అయ్యో! ఈతఁడు విద్యాధరకుమారుఁ డైన యీ జీమూతవాహనుఁడా?

మ. మలయాగ్రంబుల మందరాద్రిదరులన్
మాహేంద్రభూధ్రంబునన్
జలికొండం గనకాద్రి వెండిమలపా
షాణంబులందున్ హరి
ద్విలసత్కుంజములందుఁ బెక్కుతడవుల్
విందుంగదా వీని ని
ర్మలవాకీరితి చక్రవాళ గిరిఖే
లచ్చారణుల్ పాడఁగన్.

సర్వవిధముల మహాపాపపంకమున నిమగ్నుఁడ నైతిని.

నాయి__నాగరాజా! ఏల యిట్లుద్విగ్నుఁడ వైతివి?

సీ. ఆత్మదేహముచే వినతాత్మజాతు
నుండి నామేను కాపాడుచున్న నీవు
నకట పాతాళతలమునయందునుండి
తలమునకు నన్నుఁద్రోయుట ధర్మముగునె.

గరు— ఆహా! ఏమి! దయార్ద్రచిత్తుఁడైన యీ మహాత్మునిచే మద్గ్రాసగోచరపతితుఁడైన యీ నాగుని ప్రాణములు రక్షించుటకై స్వదేహ మాహారముగాఁ గల్పింపఁబడినది. కావున నాచే మిక్కిలి యకార్యము చేయఁబడినది. వేయేల? పాతకోదధిసత్త్వనే నేను జంపియుంటిని. అందుచే నీమహాపాతకమున కగ్నిప్రవేశముకంటె వేఱొండు ప్రాయశ్చిత్తము కానిపించుటలేదు. నే నెక్కడ నుండి యగ్నిని సంపాదింతును? (ముందుచూచి) అదిగో! ఎవరో యగ్నిని గ్రహించి యిటే వచ్చు చున్నారు. అందుచే వారికై వేచి యుండెదను.

శంఖ—కుమార! నీ తల్లిదండ్రు లరుదెంచి నారు.

నాయ—(సంభ్రమముతో) శంఖచూడ! నా చెంతకువచ్చి యుత్తరీయముచే నాచ్ఛాదిత శరీరుసఁ

గావించి నన్నుఁబట్టుకొనుము. లేనిచో నిట్టి యవస్థలో నున్న నన్నుఁజూచి తల్లి దండ్రు లొకవేళ ప్రాణములను విడువవచ్చును.

(శంఖచూడుఁడు ప్రక్కఁబడియున్న యుత్తరీయమును గ్రహించి యట్లు చేయును—అంతఁ బత్నీ వధూసమేతుఁడై నజీమూతకేతుఁడు ప్రవేశించును)

జీమూ—(కన్నీళ్ళతో) హాపుత్త్రా! జీమూతవాహన!

మ. పరుఁడార్త్రుఁడు నన్క్రియుంబు కరుణం
బాటిల్లదా నికర్కము
కర్కరుఁడాపల్వారి? రక్ష్యులన్త్రలఁపు క
లన్ లేదు నీకేటి, కీ
యురగున్ దార్ష్యునినుండి ప్రోచుటకు నై
నుజ్జించు నీ చేత రూ
పతియెంగాదె పిత్రుప్రియాత్మమయ మీ
యూవత్కులంబుం గటా!

వృద్ధ—(మలయవతి నుద్దేశించి) అమ్మాయీ! ఊణ మాగు. ఎడతెఱపిలేకుండా కారే నీకన్నీళ్ళచే అగ్ని ఆరిపోతుంది. అంచేత ఏడ్వకు.

(అందఱును బరిక్రమింతురు)

జీమూ—హా! పుత్ర! జీమూతవాహన!

గరు—(విని) అహా! ఈతఁడెవరు? హా పుత్త్ర! జీమూతవాహనా యని పలుకుచున్నాఁడు. అందుచే నీతఁ డితనితండ్రి యని సువ్యక్త మగుచున్నది. ఇంక నీతనియగ్నిచే నేమి ప్రయోజనము. పుత్రునిఁ జంపినకతనఁ గల్గుసిగ్గుచే నీతనిముఖము చూడఁ జాలకున్నాను. నే నగ్నికొఱకై కలతనొంద నేల? సముద్రతీరమునందే కదా యున్నాను. అందుచే నిప్పుడు.

శా. జ్వాలాభంగములన్ జగత్త్రయజిఘ
త్సాతాలజిహ్వాగ్ర క
ల్పాలన్ సప్తవిసర్పిహస్తముల సం
ద్రాలన్ దృణంబుంబలెన్
గ్రోలంజాలి మదీయపక్షజమరు
త్ప్రోచ్చాలితం బౌట లో
కాళిగ్రాసిలయాగ్నిభీద మగు నీ
యౌర్వాగ్నిలోఁ ద్రెళ్లెదన్.

(అని లేవఁగోరును)

నాయ— భో విహగరాజా! ఈప్రయత్న మింకఁజాలును. ఈ పాపమున కది ప్రతీకారము కాదు.

గరు—(మోఁకాళ్లపైఁ గూర్చుండి కృతాంజలియై) మహాత్మా! అయిన నింకేదియో చెప్పుము.

నాయ—ఒక్క క్షణ మాగుము. ఇంతలో వచ్చిననాతల్లిదండ్రులకు నమస్కరించెదను.

గరు—అట్లే యొనరింపుము.

జీమూ—(చూచి సంతోషముతో) దేవీ! అదృష్టముచే వర్ధిల్లుచున్నావు. మనకుమారుఁడు జీమూతవాహనుఁడు కేవలము ప్రాణములతో నుండుటయేకాక శిష్యునివలె కృతాంజలియైన గరుడునిచే నుపాస్యమానుఁడై కనవచ్చుచున్నాఁడు.

వృద్ధ—(హర్షముతో) మహారాజా! కృతార్థురాలనయ్యాను. అక్షతదేహుఁడైనకుమారుడి ముఖం చూస్తాను.

నాయి—నిజంగా ఆర్యపుత్రుణ్ణి చూస్తూ ఉన్నా అతిప్రియమైనకారణంచేత నాహృదయం విశ్వసించకుండా ఉన్నది.

(నాయకుఁడు లేవఁగోరుచుఁ బతితోత్తరీయుఁడై మూర్ఛిల్లును)

శంఖ—కుమారా! ఊఱడిల్లు మూఱడిల్లుము.

జీమూ—హా వత్స! నన్నుఁ జూచియును బరిత్యజించి చనినాఁడ వేమి?

వృద్ధ—హా కొడుకా! ఏమి? మాటచేతనైనా నన్ను సంభావించవైతివి?

నాయి—హా! ఆర్యపుత్ర! గురుజనంకూడా నీచే ఉపేక్షింపబడ్డదికదా!

(అందఱును మోహము నొందుదురు)

శంఖ—ఓరీ శంఖచూడహతకా! పరాత్మ రక్షితజీవితా! ఇట్లు క్షణక్షణమును మరణాతిగమైన దుఃఖమనుభవించుటకంటె గర్భస్థితుఁడవై యుండఁగనే యేల మరణింపవైతివిరా?

గరుడుఁడు—ఇదంతయు నృశంసుఁడనైన నా అవిమృశ్యకారితయొక్క విజృంభణము. అందుచే నట్లొనరించెదను. (ఱెక్కలతో విసరుచు) మహాత్మా! ఊఁటడిల్లు మూఁటడిల్లుము.

నాయ—శంఖచూడ! పితరులనూఁటడింపుము.

శంఖ—తాత! ఊఁటడిల్లుము. తల్లీ! ఊఁటడిల్లుము. జీమూతవాహనుఁ డూఁటటగాంచినాఁడు. మీరు చూచుటలేదా? ఇమ్మాఁటడించుటకొఁటకే లేచి కూర్చున్నాఁడు.

(ఇరువురు నూఁటడిల్లుదురు)

వృద్ధ—కొడుకా! మేము చూస్తూఉండగానే కృతాంతహతకుడిచే అపహరింపబడుతున్నా వేమి?

జీమూ—దేవి! ఇట్లమంగళము పల్కకుము. ఆయుష్మంతుఁడు ప్రాణములతోనే యున్నాఁడు.

వృద్ధ—(ముఖము వస్త్రముచేఁగప్పి యేడ్చుచు) అమంగళం ప్రతిహతమాగాక! ఇంక ఏడ్వను. (మలయవతి నుద్దేశించి) అమ్మాయీ!

కొంటడిల్లు చూాటడిల్లుము. లేలెమ్మా! అవకాశ మున్నంతదాకా నీ ధర్మముఖం చూస్తూ ఉండడం మేలు.

నాయి:—(కొంటడిల్లి) హా! ఆర్యపుత్ర!

వృద్ధ—(మలయవతిముఖము చేతితోఁదుడిచి) సౌభాగ్యవతివికా. విఘ్నం ప్రతిహత మైంది.

జీమూత—(కన్నీళ్ళతో తనలో)

చ. ఇతరము లైనయంగకము
లెల్ల విలుప్తములౌట నన్యహా
గతి యెది లేమినో యనఁగ
గంఠగతత్వము చెందుప్రాణముల్
చ్యుతము లొనర్పు నాత్మజునిఁ
జూచియు నే శతధా విఖండిత
స్థితిఁ గొనకుందు నెంతఘము
చేసినపాతకి నౌదునోకదా!

నాయి—ఈలాంటి స్థితిలో ఉన్న ఆర్యపుత్రుణ్ణి చూస్తూకూడా జీవితం విడవకుండా ఉన్న నే నెంత దుఃఖభాగినినోకదా!

వృద్ధ— (నాయకునంగములు స్పృశించి గరుడు నుద్దేశించి) ఓరీ నృశంసుడా! నగలకిమ్ ఁడా కాంతి కలిగించే మా కుమారుడిశరీరా న్నిలాంటి స్థితి కేలా తేగలిగావో చెప్పు.

నాయ— అమ్మా! అ ట్లనకుము. ఈతఁ డేమి చేసెను? ఇది మున్నుకూడ నిట్టిదే? పర మార్థము పరికింపుము.

క. ఎముకల మేదో౽సృఙ్మాం
సములను మజ్జాదిఁగూడి చర్మావృతమై
యమితజుగుప్సాకరరూ
పము గలదేహమున నెట్టి ప్రభ దైవారుఁ.

గరు—మహాత్మా! నన్ను నరకానలజ్వాలా వలీఢునివలెఁ దలంచుచు దుఃఖము ననుభవించు చున్నాను. అందుచే నీ దుఃఖమునుండి యెట్లు ముక్తుడ నౌదునో నా కుపదేశింపుము.

నాయ—తండ్రిగారు నా కనుమతి యిత్తురు గాక. ఈతని పాపమునకుఁ బ్రాయశ్చిత్తము నుప దేశింతును.

జీమూ—వత్సా! అట్లొనరింపుము.

నాయ—వైనతేయా! వినుము.

గరు—(మోకాళ్ళపైఁ గూర్చుండి శిరమున నంజలి బంధించి) ఆజ్ఞాపింపుము.

నాయ—వినుము

ఉ. మానుము ప్రాణిహింస, కొను
మా యనుతాపము ప్రాకృతంబుకై
పూని గడింపు పుణ్యమును
భూతసమూహికభీతి కూర్చుచుం,
బ్రాణివధోత్థపాపపరి
పాకము దాన నడంగెడిన్ ఁదటా
కాన నగాధమైనయుద
కంబుల వైచినను పప్పుఁగ ల్లటుల్.

గరు—పూజ్యుఁ డాజ్ఞాపించినట్లే.

గీ. నిరయకర మగునజ్ఞానసుద్రయందు
నుండి నీచేతఁ బ్రతిబోధితుండ నైతి
నేఁటినుండియు సర్వప్రాణిప్రఘాత
కిల్బిషంబును నే నుజ్జగించి వైతు.

ఇప్పుడు,

చం. పులినవిశాలభోగతతి
పొల్పున నొక్కట ద్వీపరూపమై
వలయితగాత్ర మొకట సుడి
భ్రాంతి నొకంట జనింపఁజేయు చి
వ్వలిదరినుండి యవ్వలికిఁ
బాఱుచు నొక్కట సేతుతుల్యమై
సలిలనిధానమం దురగ
సంఘములీలఁ జరించుఁ గావుతన్.

మఱియు

సీ. ప్రస్తమ్ములౌట నాచరణావలంబులై
తేఱుచుఁ జీఁకటిఁబోలు కురులు తాల్చి
ప్రథమార్కకిరణతామ్రము లౌట సిందూర
మలఁదిన ట్లున్న చెక్కులు ధరించి
సంతతవిహరణశ్రాంతాంగలత లైన
నానందమున రుజ నవగణించి
సహజమాధుర్యశస్తముకా నెలుంగుల
కనుగుణశ్రుతుల పెంపావహించి

యిమ్మలయజావనీజవనమ్మునందు
యౌవనోల్లాసి నాగకన్యకలు సతము
ముదితపరమకృతజ్ఞతాహృదయ లౌచుఁ
బాడుచుందురుగాక తావకయశమ్ము.

నాయ—బాగు! మహాత్మా! బాగు. మే మెంతయు ననుమోదించుచున్నాము. సర్వదా దృఢసమాధివి కమ్ము. (శంఖచూడుని నిర్దేశించి) శంఖచూడ! నీవు కూడ సంకమాయింటి కరుగుము.

(శంఖచూడుఁడు నిట్టూర్పుపుచ్చి యధోముఖుఁడై యుండును)

నాయ—(శంఖచూడునిఁ జూచుచు) శంఖచూడ! త్వరగా నరిగి శోకాకులయైన మీయమ్మను గాంచుము.

ఆ. శాతమైన తేయచంచుకోటినిపాతి
తాత్ముఁగాఁగ నిన్ను నాత్మఁ దలఁచి
నిన్నుఁ గన్నతల్లి నీ దుఃఖమునఁ జేసి
నెగులుగుడుచుచుండు నిక్కువముగ.

వృద్ధ—(కన్నీళ్ళతో) గరుడుని నోటిలో బడ్డా అక్షతాంగుడై ఉన్న కుమారుడి ముఖం చూచే తల్లి నిజంగా ధన్యురాలుగదా?

శంఖ—తల్లీ! కుమారుఁడు స్వస్థుఁడు కాఁగల్గుచోల్గు నది నిజమే.

నాయ— (వేదన నటించుచు) పరార్థసంపాదనరసాక్షేపితములై యింతదనుక తెలియఁబడక మర్మచ్ఛేదకములైన వేదన లిప్పుడు నన్ను బాధింప నారంభించినవి. (మరణావస్థను నటించును)

జీమూ—(సంభ్రమముతో) వత్సా వత్సా! ఏమి ఇట్లొనరించుచున్నావు.

వృద్ధ—అయ్యో! ఏమిటి ఈలా పలుకుతున్నాడు. రక్షించండి. రక్షించండి. ఈ మా కొమారుడు మరణిస్తున్నాడు.

నాయి—ఆర్యపుత్రా! నన్ను విడిచివెళ్ళడం నీకు తగునా?

నాయ— (అంజలి బంధించి) శంఖచూడ! నా రెండుచేతులను దగ్గఱకుఁ జేర్చుము.

శంఖ——(అట్లుచేయుచు) అయ్యో! కష్టము. లోక మనాథముగాఁ జేయఁబడినది.

నాయ——(కొంచెము కన్నులు తెఱచి తల్లి దండ్రులఁజూచుచు) తల్లీ! తండ్రీ! ఇది నా కడపటి ప్రణామము. ఏలన?

గీ. అంగములయందుఁ జైతన్య మడఁగిపోయె
 వినదు స్ఫుటవర్ణమౌవచోవితతి వీను
 కటకటా! ఉన్నయటు లుండి కన్ను మొగిడె
 వశమఱిన నాదునసువులు పాయుఁ దండ్రి!

ఈ ప్రలాపమునవలన నేమి ప్రయోజనము?

(అని పడిపోవును)

వృద్ధ——అయ్యో! కొడుకా అయ్యో! వత్సా! హా! గురుజనవత్సల! ఎక్కడికి పోయావు. నాకు జవాబు చెప్పు. హా లోచనానంద! హా జీమూత వాహన! నీ దర్శనం నాకు మళ్ళీ ఎట్లా?

జీమూ——హా పుత్ర! జీమూతవాహన! హా నిఖిలజన వత్సల! హా సర్వగుణనిధే! ఎక్కడ

నున్నావు? నాకు త్రాసముచుట్టి (చేయెత్తి) అయ్యో! కష్టము. కష్టము.

చం. వినయ మింకెవ్వరికిఁ గలుగ
వేఁడు నిరాశ్రయ మయ్యె ధైర్య మె
వ్వని కగుఁ దాల్మి తాల్పఁగల ప్రజ్ఞ వి
తీర్ణత యేది నష్టమై
చనియె నిజమ్ము సూనృతము నాగు
నికం గృప యేడ నార్తమై
తినయమణీ! భవన్మృతికతంబున
లోకము లెల్ల శూన్యముల్.

నాయ—అయ్యో! ఆర్యపుత్రా! నన్ను విడిచిపెట్టి ఎట్లా వెళ్ళిపోతివి? ఓసి నిర్దయహృదయురాలా! వజ్రకఠినాంగీ! మలయవతీ! ప్రాణనాథుడు లేకుండా ఎట్లా యిప్పుడుకూడా జీవిస్తున్నావు?

శంఖ— హా! సర్వ్యాజపరోపకార పరాయణా! ప్రాణములకంటెను ప్రియతరమైన యీ జనమును వీడి పోవుటకు కరిగెదవు? ఈ శంఖచూడుఁడు తప్పక నిన్ననుసరించును.

గరు—అయ్యో! కష్టము! ఈ మహాను భావుఁడు మరణించినాఁడు. ఇప్పు డింక నేమిచేయుదును?

వృద్ధ—(కన్నీళ్ళతో పైకిఁ జూచి) భగవంతులైనలోకపాలకులారా! అమృతం చల్లి ఐనా ఈ నా కొడుకు నేలఁ బ్రతికింపరు?

గరు—(సంతోషముతో - తనలో) అమృతసంకీర్తనముచే లెస్సగా స్మృతికి వచ్చినది. ఇంక నపకీర్తి తొలఁగిన దని తలంతును. ఇప్పుడు దేవేంద్రుని వేఁడి తద్విసృష్టమైనయమృతవర్షముచేఁ కేవల మొక్క జీమూతవాహనునే కాక పూర్వభక్షితులును నస్థిమాత్రశేషులును నైననాగులను గూడ మరల జీవింపఁజేసెదను. వేఁడినను ఆతఁ డొసంగనిచో.

చ. పటుపతనేర్యమాణపవ
పతువికంపితవారిదుండనై
చటులదృశార్చిదాహవివ
శప్రపతద్విదశార్కవహ్నినై

పటపట ముక్కునం జదిమి
వజ్రికుబేరయమాయుధంబులన్
దిటవున నోర్చి వేల్పుల న
నిం గురియించెద సౌధవర్షమున్.

ఇంక వెళ్లెదను. (సాటోపముగా పరిక్రమించి నిష్క్రాంతుఁ డగును.)

జీమూ—వత్స! శంఖచూడ! ఇంకను నేల ప్రతీక్షించెదవు? కట్టెలు సమకూర్చి మా కుమారు నికిఁ జితాగ్ని రచింపుము. మేముకూడ నాతని తోడనే యరిగెదము.

వృద్ధ—నాయనా! శంఖచూడ! తొందరగా రచించు. మేములేకపోతే మీా సోదరుడికి దుఃఖం కలుగుతుంది.

శంఖ—(కన్నీళ్ళతో) గురుజనులు చెప్పి నట్లే చేసెదను. నేనును మీాకు ముందుగా నరుగు వాఁడనే. (లేచి చితి రచించి) తల్లీ! తండ్రీ! ఈ చితి సిద్ధమైనది.

జీమూ—అయ్యో! కష్టము. కష్టము.

మ. పొలుపారెం దలపాగ శీర్షముపయిన్
భ్రూమధ్యమం దూర్ణయుం
జెలఁగెం గన్నులు తమ్మిరేకు లనఁ బా
ల్చెన్ బొమ్మ సింహాసనము
ట్లలరెం జక్రము లొప్పెఁ బాదములయం
దా నైన మద్దుష్కృతా
వళి విద్యాధరచక్రవర్తి పదముం
బ్రాపింపకే యేగితే?

దేవి! ఇం కేల యేడ్చెదవు? లెమ్ము. చితి నారోహింతము.

(అందఱును లేచుదురు)

నాయి—(దోసిలియొగ్గి పైకిఁజూచుచు) భగవతిగారీ! విద్యాధరచక్రవర్తి నీకు భర్త కాఁగలఁడని సెలవిస్తివిగదా! ఇప్పు డి దేమి? దురదృష్టవంతురాల నైననా విషయములో అసత్యవచనవైనావు.

(అంత సంభ్రమముతో గౌరి ప్రవేశించును.)

గౌరి—మహారాజ జీమూతకేతూ! సాహస మనుష్ఠింపకుము.

జీమూ.—అహాహా! ఏమి? అమోఘదర్శన యైన గౌరియా?

గౌ.—(మలయవతినుద్దేశించి) వత్సా! నే నెట్లసత్యవచన నగుదును? (నాయకుని సమీపించి కమండలూదకములు చల్లి)

గీ. నైజజీవితత్యాగ మొనర్చి యైన
జగతి కెవ్వాడు నుపకృతిసలుపునట్టి
నీయెడ న్నేను జాల సంతృప్తిఁగొంటి
వత్స! జీమూతవాహనా! బ్రతుకుమయ్య!

(నాయకుఁడు లేచును)

జీమూ.—(సంతోషముతో) దేవి! అదృష్టము చే వర్ధిల్లుచున్నావు. కుమారుఁడు మరల జీవించినాఁడు.

వృద్ధ.—భగవతిగారి అనుగ్రహంచేత.

నాయ.—(గౌరినిజూచి బద్ధాంజలియై) అహాహా! అమోఘదర్శనయైన గౌరియా?

క. శరణాగత జనపీడా
హరణ ప్రవణాత్మ! వాంఛితాధికవరదా!

యెఱుఁగద నీ చరణములను
ఖగవిద్యాధర సమాజవందితచరణా.

(అని గౌరి పాదములపైఁ బడును)

(అందఱును బైకిఁ జూతురు)

జీమూ—అహా! ఏమి మేఘములేనివాన! గౌరి! యిది యేమి?

గౌరి—రాజా! జీమూతకేతూ! జీమూతవాహనుని నస్థిశేషు లైనయీ నాగరాజులను తిరిగి జీవింపఁజేయుటకై పశ్చాత్తాపపూరితుఁ డైన గరుడునిచే దేవలోకమునుండి యీ యమృతవర్షము కురియింపఁబడినది. (వ్రేలితోఁ జూపుచు) మీరు చూచుటలేదా?

మ. నెఱమేనుల్ గొని స్పష్టరత్నరుచి
    సందీప్తోత్తమాంగంబులన్
ధరపీయూషరసాభిలాషరసనా
    ద్వంద్వంబున న్నాకుచున్
ద్వరమై జందనధారుణీధరఘురాం
    భఃపూరముల్ నానదే

శరధిం జేరెడి వక్రయానములతో
సర్వాధివాధావళుల్.

(నాయకు నుద్దేశించి) వత్సా! జీమూతవాహన! నీవు కేవల మొక్క జీవితదానమునకే కాదు యోగ్యుడవు. ఇది మఱొక ప్రసాదము.

మ. అతిపూతమ్ములు మానసాహ్వాతము
లిచ్ఛాబాధితంబుల్ చల
త్సితపత్త్రాంసవికంపితాంబుజరజ
స్సిక్త్యావిలాలంబువుల్
మతిసంకల్పజరత్నకుంభవితతిన్
మ స్తంబుపైఁ జల్లి సిన్
స్తుతవిద్యాధరసార్వభౌమపద ని
ష్ఠం జేతు ని ప్పట్టునన్.

మఱియు

గీ. కనకచక్రరత్నమును జతుస్సితదంత
సహిత మైనకరియు, శ్యామహరియు
మలయవతియు ననెడి మహితరత్నము లగ్ర
సరము లగుత కనుము సార్వభౌమ!

మఱియు నిటు చూడుము. శరశ్చంద్రధవళవాల వ్యజనములు హస్తముల ధరించి మణికాంతి రచితేంద్రధనుర్భక్తులును, భక్తివినమితపూర్వకాయులునై మతంగహాతకాదులైన విద్యాధరపతులు వంగి నమస్కరించుచున్నారు. నీ కింకను నే విధమున నుపకరింపఁగలనో చెప్పుము!

నాయ—

సీ. సంరక్షితుండ నయ్యె శంఖచూడుఁడు విహం
గాధినాథాదిభయంబునుండి
ప్రాక్తార్క్ష్యభక్షితపన్నగపరివృఢ
వితతులు ప్రాప్తజీవితములయ్యె
మృతుఁ డయ్యు మఱల నే బ్రతికినకతమునఁ
బితరులు ప్రాణముల్ విడువరైరి
సకలవిద్యాధరచక్రవర్తిపదమ్ము
ప్రాప్తించె నీ దయాప్రాభవమున
నీడజాధీశ్వరుండు వినీతుఁ డయ్యె
నంబ! నీ విట్లు మాకుఁ బ్రత్యక్షమైతి
ఘనదయామూర్తి నిన్నుఁ బ్రార్థనముచేయ
నింతకన్నను బ్రియతరం బేమి కలదు?
అయినను ఇట్లగుఁగాక.

## భరతవాక్యము

మ. తఱి సంహృష్టశిఖండినృత్యముల క
బ్దశ్రేణి వర్షించుచుఁ
ధరణిం జేయుత గాఢసంతతహరి
త్సస్యాంశుకన్ వీడి మ
చ్చరమున్ వీతవిపత్కులై సుకృతముల్
సాధించుచుఁ మానవుల్
చిరతానందము గాంత్రు బాంధవసుహృ
ల్లీలాసమాజంబులన్.

# నాగానందము

## దిద్దుబాట్లు

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 12 | 4 | దాపునున్న | దాపున నున్న |
| 14 | 11 | హాయుమై | హాయిమై |
| 15 | 10 | పాడుతున్నారు | పాటపాడుతున్నారు |
| 17 | (పద్యము మూఁడవచరణము యతి చూచుకొనునది) | | |
| 36 | 10 | చివుళ్లను | చివుళ్లను |
| 38 | 6 | అధరుఁడ | అధీరుఁడ |
| 40 | 7 | చందాస్య | చంద్రాస్య |
| 49 | 9 | గురుజనులు | గురుజనుల |
| 59 | 10 | చేటుఁగు | పిటుఁడు |
| 62 | 8 | అలంకరించును | అలంకరించు |
| 73 | 10 | ప్రిదయులతో | ప్రియులతో |
| 82 | 9 | పదార్థమునకు | పరార్థమునకు |
| 88 | 6 | తారుఁడు | తార్క్ష్యుఁడు |
| 90 | 1 | ఓట | లిట |
| 90 | 7 | నాయి | నాయు |
| 95 | 4 | నాయి | నాయు |
| 101 | 13 | నిర్వాజ | నిర్వ్యాజ |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 102 | 6 (పంక్తితర్వాత) | — | అందుచే నింక సందేహ మెందులకు. నాకో వధ్య చిహ్న మిమ్ము. |
| 114 | 14 | రాజానతమ్చుగాక | మహారాజాన తిచ్చుగాక |
| 121 | 8 | సుక్షేపముగా | సంక్షేపముగా |
| 121 | 15 | కొజాలను | కొజాలును |
| 124 | 9 | అంగాభరణమైన | అంగాభరణ చిహ్నమైన |
| 126 | 1 | ఆధారము | ఆధారను |
| 128 | 18 | అర్పించుచు | అర్పించును |
| 129 | 2 | గఘనీకృత | ఘనీకృత |
| 130 | 17 (పంక్తితర్వాత) | — | శంఖః— ఏమి యిది యావేగమునకుఁ దగిన సమయము కాదా. |
| 131 | 8 | కల్పింపఁబడినది | కల్పింపఁబడినదా. |
| 139 | 13 | ఉష్ణగల్లటుఙ | ఉష్ణగల్లటుల్ |
| 140 | 17 | శస్త్రముకొ | శస్త్రములో. |
| 144 | 11 | నాము | నాయు |
| 148 | 9 | బతుకుమయ్యా | బ్రతుకుమయ్యా |